

"ప్రెషర్ కుక్కర్స్ డీలర్‌నైన నేను, ఏది భద్రతగల కుక్కర్లో ఏది మరింత భద్రతాయుక్తమైనదో చెప్పగలను. అయితే వాటి అన్నింటిలోను అత్యంత భద్రమైనది న్యూ ప్రెస్టీజ్. కనుక మీరు మీ శ్రీమతికి న్యూ ప్రెస్టీజ్‌ని కొనిపెట్టారంటే, మీకు ఆమెపట్ల మిక్కిలి మక్కువ కలదని నిరూపిస్తున్నారన్న మాట. మరియు ఆమె శ్రేయస్సుకే అత్యధిక ప్రాధాన్యాన్ని యిస్తున్నారన్న మాట—సర్వదా.

## న్యూ ప్రెస్టీజ్ ఎంత భద్రమైనదో చూడండి




నూటికి నూరుపాళ్ళు భద్రతను చేకూర్చే అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టం (జి.ఆర్.ఎస్.) ఒక్క న్యూ ప్రెస్టీజ్‌కి మాత్రమే కలదు. 'వెయిట్ వెంట్' పూడుకొనిపో యినట్లయితే, కుక్కర్ లోపల మితిమించిన ఒత్తిడి ఏర్పడుతుంది.




ఇది కుక్కర్‌కు అత్యంత సమీపములో వున్న వ్యక్తికి ప్రమాదకరంగా పరిణమించవచ్చును.

న్యూ ప్రెస్టీజ్ అయితే, మితిమీరి ఏర్పడిన నీటి ఆవిరి జి.ఆర్.ఎస్‌ను బయటకు నెట్టుతుంది. తత్ఫలితంగా జి.ఆర్.ఎస్. ఆవిరిని భద్రంగా, రూఢిగా క్రిందికి విడిచిపెడుతుంది. గాస్కెట్‌ను ఒక స్పూన్‌తో లోపలికి నెట్టండి.



అంతే, ప్రెషర్ కుక్కర్ తిరిగి వినియోగానికి సిద్ధంగా వుంటుంది. న్యూ ప్రెస్టీజ్ అయితే ఎన్నడూ అణుమాత్రంకూడా ప్రమాదం వుండదు. అందుచేతనే ఎట్టి పరిస్థితులలోనైనప్పటికి అది అత్యంత భద్రమైనది. సర్వదా."

# భార్యపై నిజమైన ప్రేమగలవారు ప్రెస్టీజ్ వద్దని ఎట్లా అంటారు







TTK తయారీ

న్యూ ప్రెస్టీజ్ ఒక్కటి మాత్రమే 100% భద్రమైనది. న్యూ ప్రెస్టీజ్ ఒక్కదానికి మాత్రమే జి.ఆర్.ఎస్. కలదు.

MAA (S) TTP 3G TEL 85

# పుప్పిపళ్లను ఎదుర్కోడానికి ఒక సూపర్ ఫైటర్ వుంటేనే సాధ్యం.






















ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్ ప్రసిద్ధ ఫోర్‌హాన్స్ రక్షణ అందిస్తుంది.




ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్ చిగుళ్లను బిగిస్తుంది. పుప్పిపళ్లను ఎదుర్కొంటుంది.

404 GM-183 TEL

ప్రకృతి సిద్ధమైన తేనెల తియ్యదనం......

న్యూట్రిన్
హనీఫ్యాబ్






nutrine
Honeyfab

నోరూరించే రుచికరం
సహజమేగా మరి!




భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే మిఠాయిలు

న్యూట్రిన్ కాన్ఫెక్షనరీ కంపెనీ ప్రై. లిమిటెడ్, చిత్తూరు-517 002 (ఆంధ్రప్రదేశ్)

CLARION/NC/8572

# చందమామ


నంస్థాపకుడు : 'చ క్ర పా ణి'

నంచాలకుడు : నా గి రె డ్డి


ఈ నెల బేతాళకథ [''అక్క చెల్లెళ్లు'']కు ఆధారం, లక్ష్మిగాయత్రి రచన. నేరపరిశోధన గొప్ప కళగా, శాస్త్రజ్ఞానంగా మన్నన పొందుతున్నది. నేరస్థు డెవరో గుర్తించి, రుజువు పరచగలవాడు—తార్కిక దృష్టి కలిగి, మానవ మనస్తత్వం తెలిసిన మేధావి అయివుండాలి. ఇది ''దొంగనుపట్టే ఉపాయం'' అన్న కథలో నిరూపించబడింది.

## అమరవాణి

విజ్ఞః స్వం మన్యతే బాజ్ఞ, మజ్ఞో వర్తేత విజ్ఞవత్,
మూకీభావం వహన్ ప్రాజ్ఞః, పురుషేమూత్తమోత్తమః.

[విద్యావంతుడు తాను తెలియనివాడిననీ, విద్యావిహీనుడు తాను నర్వం తెలిసినవాడిననీ చెప్పుకుంటారు. ఏమీ చెప్పక మౌనం వహించినవాడే ఉత్తమోత్తముడు.]


సంపుటి 78 ఏప్రిల్ '86 సంచిక 4

విడి ప్రతి : 2–50 : : నంవత్సర చందా : 30–00







# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక" — ఫెవీ ఫెయిరీ





"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
దబ్బూతోనూ పనియే లేదు
దీనికి యిక మరి ఎదురేలేదు."
"ఏమిటిదంతా యిదొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషా యిక
బొమ్మలైనా చేసెయ్యండి"

జపాను పూలు (క్రిసాంథిమమ్స్) ఎలా తయారు చేయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటంకోసం ఈ కూపన్‌ను పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి: "ఫెవీ ఫెయిరీ," పోస్ట్ బాక్స్ 11084 బొంబాయి 400 020.

జపాను పూలు (క్రిసాంథిమమ్స్) ఎలా తయారు చేయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటంకోసం ఈ కూపన్‌ను చిరునామాకు పంపించండి : "ఫెవీ ఫెయిరీ," పోస్ట్ బాక్స్ 11084 బొంబాయి 400 020.

పేరు : ____________________

వయస్సు : ____________________

చిరునామా : ____________________

____________________

నగరం : ____________________

రాష్ట్రం : ____________ పిన్ : ____________

(Ch)

**ఫెవికాల్** ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్




**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ ఆర్ అంటేనే అది**

® ఒక "పిడిలైట్" ఉత్పత్తి ఫెవికాల్ ... పిడిలైట్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి 400 021 వారి రిజిస్టర్డ్ (ట్రేడ్ మార్క్) గుర్తు.

OBM-7070 TL

# చందమామ కబుర్లు



## సముద్రం మీద వింత దృశ్యం!

జపాన్ ఎయిర్ లైన్స్‌కు చెందిన కేప్టన్ చార్లెస్ మెక్‌దేడ్, విమానంలో వెళుతున్నప్పుడు, టోక్యోకు ఈశాన్య దిశగా 25 మైళ్ళ దూరంలో సముద్రమధ్యం నుంచి హఠాత్తుగా 60,000 అడుగుల ఎత్తూ, 200 మైళ్ళ విస్తీర్ణంలో మేఘం లాంటి పొగ పైకి రావడం, క్రమేణా మాయమవడం చూసినట్టు చెబుతున్నాడు. బహుశా సముద్ర గర్భంలోని అగ్నిపర్వతం బద్దలు కావడం వల్ల, అలాంటి దృశ్యం ఏర్పడి ఉండవచ్చని శాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

## మత్తుకు బలి అయిన పక్షులు



దాదాపు 400 రాబిన్ పక్షులు ఆకాశంలో ఎగురుతూ, కాలిఫోర్నియా హైవేస్ రోడ్డు మీద పడి, కార్ల రాకపోకల మధ్య నలిగి చచ్చాయి. ఆ పక్షులు తిన్న పళ్ళు, అతిగా మగ్గి పులియడం వల్ల, ఆ పక్షుల మీద మత్తుపానీయంలా పని చేశాయనీ, అందువల్లనే ఎగురుతూన్న పక్షులకు దారీ తెన్నూ తెలియక, రోడ్డు మధ్యన పడిపోయాయనీ తెలియవచ్చింది!

## అంతరిక్షం నుంచి నౌకాశకలం!



1908 వ సంవత్సరం జూన్ 30 వ తేదీన, ఆకాశం నుంచి ఒక పెద్ద మెరిసే వస్తువు పడడంతో, దాని తాకిడికి సెంట్రల్ సైబీరియాలోని 1,500 చదరపుమైళ్ళ విస్తీర్ణం భూమి అదిరింది. ఇటీవల దాని మీద విస్తృతంగా పరిశోధనలు జరిపిన సోవియట్ శాస్త్రజ్ఞుడు ఎన్. వాసిలీవ్, అది 11 బిలియన్ సంవత్సరాల నాటి వ్యోమ నౌకాశకలం అనీ, సుదూర నక్షత్రం నుంచి పంపబడి ఉండవచ్చునీ, అభిప్రాయం వెలిబుచ్చాడు!

# మీకు తెలుసా?

1. ప్రపంచంలోకెల్లా అత్యధికమైన బరువు గల గంట ఏ నగరంలో ఉన్నది?
2. ప్రపంచంలో మొట్టమొదట నిర్మించబడిన ఎత్తయిన కట్టడం ఏదో మీకు తెలుసా?
3. ప్రపంచంలోకెల్లా అత్యంత విలువైన చిత్రపటంగా భావించబడుతున్న చిత్రం ఏదో మీకు తెలుసా?
4. అతి పురాతనమైన జాతీయగీతం గల దేశం ఏది?
5. ప్రపంచంలోకెల్లా అత్యధికమైన ఆంగ్ల పత్రికలు వెలువరించే దేశం ఏది?

(సమాధానాలు 65 వ పేజీలో)

పురాణగాథలు :

# అరిష్టనేమి

ఒకానొకప్పుడు ఒక రాజు వేటకు వెళ్ళాడు. అడవిలో ఎంతసేపు తిరిగినా, ఒక్క జంతువు కూడా రాజు కంటబడలేదు. ఆఖరికి కొండ దిగువ రెండు పొదల మధ్యన, ఒక జింక వెళ్ళడం రాజుకు కనిపించింది. వెంటనే రాజు దాని మీదికి బాణం వదిలాడు. ఆ దెబ్బకు మానవస్వరంతో "అయ్యో!" అని మూలుగు వినిపించగానే, ఆశ్చర్యంతో రాజు అక్కడికి పరిగెత్తాడు. అక్కడ జింక చర్మం కట్టుకున్న ఒక మునికుమారుడు బాణం దెబ్బకు, చచ్చిపడి ఉండడం చూసి దిగ్భ్రాంతి చెందాడు!

తను చేసిన అపరాధం బయటపడక ముందే, అక్కణ్ణించి పారిపోవడం శ్రేయస్కరం అని ఒక్క క్షణం రాజు భావించాడు. కాని, మరు క్షణమే, ఆ పిల్లవాడి తల్లిదండ్రుల దగ్గరికి పోయి, క్షమాపణలు చెప్పుకోవాలని నిశ్చయించుకుని, చుట్టుపక్కల కలయతిరిగాడు. సెలయేటి సమీపంలో ఒక కుటీరం కనిపించగానే, అక్కడికి వెళ్ళి, కుటీరం నుంచి బయటకు వస్తూన్న అరిష్టనేమి అనే మునికి నమస్కరించి, "స్వామీ, జింక చర్మం కట్టుకున్న మునికుమారు డెవరైనా ఆ గుట్టకేసి వచ్చాడా?" అని అడిగాడు.

"అవును. నా కుమారుడే దర్భలకోసం అటు వెళ్ళాడు," అన్నాడు ముని. అప్పుడే దర్భలకట్ట చేత బట్టుకుని మునికుమారుడు అక్కడికి వచ్చాడు!

అతణ్ణి చూసిన రాజుకు ఆశ్చర్యంతో మాట పెగలలేదు. కొంతసేపటికి తేరుకుని, "జింక అని పొరబడి, మీ కుమారుణ్ణి బాణంతో కొట్టాను. బాణం దెబ్బకు అతడు చచ్చిపడి ఉండడం నా కళ్ళారా చూశాను. అతడే ఇప్పుడిలా సజీవుడై రావడం చూసి నమ్మలేకుండా ఉన్నాను," అన్నాడు రాజు.

"అవును నాయనా, నా కుమారుణ్ణి నువు బాణంతో కొట్టిన మాట నిజమే. కాని, మా ప్రాణాలు భగవదర్పితాలు. ఇలాంటి దెబ్బలు మాకు ఎటువంటి హానీ కలిగించజాలవు," అన్నాడు అరిష్టనేమి చిన్నగా నవ్వుతూ!





# యోగ్యతాపరీక్ష

రమాపతికి, సువర్చల ఒక్కతే కూతురు. చిన్నతనంలోనే తల్లిని కోల్పోయిన ఆమెను, ఎంతో అల్లారుముద్దుగా పెంచాడు. ఇప్పుడు సువర్చలకు పెళ్ళీడు వచ్చింది. రమాపతి తగిన సంబంధాలకోసం ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఒకనాటి సాయంకాలం, ఆయనకు పొరుగు గ్రామంలో వున్న బాల్యమిత్రుడి నుంచి, ఒకసారి వచ్చిపోవలసిందిగా కబురు వచ్చింది. రమాపతి బయలుదేరుతూ, కూతురుకు తగు జాగ్రతలు చెప్పి, "రేపు ఉదయానే బయలుదేరి వస్తాను. రాత్రికి మరిచిపోక తలుపులన్నీ లోపల గడి వేసుకుని పడుకో," అని హెచ్చరించాడు.

"నువ్వేమీ ఆదుర్దాపడక, వెళ్ళిరా, నాన్నా. నేనేమంత చిన్నపిల్లను కాదులే," అని సువర్చల తండ్రిని సాగనంపింది.

ఒక రాత్రివేళ ఆమెకు చిన్నగా కునుకు పడుతూండగా, వీధితలుపు నెవరో గట్టిగా తట్టిన శబ్దం అయింది. ఇంత రాత్రివేళ వచ్చింది ఎవరా, అనుకుంటూ సువర్చల పక్కన వున్న కిటికీ తెరిచి బయిటికి చూసింది. సన్నగా పడుతున్న వానలో తడుస్తూ, ఒక ముసలివాడు తలుపు పక్కన నిలబడి వున్నాడు.

సువర్చల కిటికీ తెరవడం చూస్తూనే ముసలివాడు, "ఈ రాత్రికి తల దాచుకునేందుకు చోటిచ్చి పుణ్యం కట్టుకో, తల్లీ. ఊరు కాని ఊరు. పైగా వాన. ఒంట్లో నలతగా వున్నది." అన్నాడు.

సువర్చలకు వాడి మీద జాలి కలిగి వెంటనే తలుపు తెరిచి, "లోపలికి రా, తాతా!" అన్నది.

ముసలివాడు లోపలికి వచ్చాడు. ఆమె ఒక పొడిబట్ట ఇచ్చి, ఒళ్ళు తుడుచుకో

మాచిరాజు కామేశ్వరరావు



చేస్తూండగా, హఠాత్తుగా ఆమె మెడ మీద ఏదో తగలడంతో, తల ఎత్తి చూసింది. ముసలివాడు ఆమె కంఠం కేసి ఒక పదునైన కత్తిని చూపిస్తూ, "మర్యాదగా, ఇంట్లో వున్న నగలూ, డబ్బూ మూటకట్టి ఇటివ్వు. ఏదైనా తెగింపు చేయబోయావో, నీ ప్రాణానికేముప్పు!" అన్నాడు కఠినంగా.

ఊహించని యీ పరిణామానికి సువర్చల నిర్ఘాంతపోయి, అంతలోనే తెప్పరిల్లి, "ఆశ్రయం ఇచ్చినవాళ్ళకే ద్రోహం తలపెట్టావా! దొంగకు కూడా ఏదో కొంత కృతజ్ఞత వుంటుందంటారే!" అన్నది.

ముసలివాడు పళ్ళుకొరుకుతూ, "ఇదొక పెద్ద ఆశ్రయం యివ్వడమా? తలుపు తెరవకపోతే బద్దలుకొట్టి వుండేవాడిని. ఈ ఊసుపోని కబుర్లెందుకు, ముందు డబ్బూ, నగలూ ఎక్కడ వున్నవో చూసి, మూట కట్టుకురా," అన్నాడు.

సువర్చల ఏమాత్రం భయపడక, "భోజనం అయితే పెట్టాను గాని, డబ్బు మూట కూడా కట్టి ఇవ్వమంటే ఇవ్వను. అదుగో, ఆ గదిలో వున్న పెట్టెలోనివన్నీ మూట కట్టుకుని, నీదారిన వెళ్ళు," అన్నది.

ముసలివాడు వెంటనే, ఆమె చూపిన గదిలోకి వెళ్ళాడు. సువర్చల మెరుపులా

మని చెప్పింది. వాడు ఒళ్ళు తుడుచు కుంటూ చుట్టూ కలయచూసి, "ఇంత రాత్రివేళ, ఇంట్లో ఒక్కతెవేనా?" అని అడిగాడు.

ఆమె తన తండ్రి పొరుగూరు వెళ్ళిన వైనం చెప్పి, "మొహమాటపడకు, తాతా. రాత్రి భోజనం చేశావా?" అని అడిగింది.

వాడు తల వంచుకుని, చేయలేదన్నట్టు ఆడించాడు. ఆమె వాడికి అప్పటికప్పుడు, తాను తినగా మిగిలిన అన్నం, కూరలూ వడ్డించింది. ముసలివాడు కాస్సేపటిలో తృప్తిగా తిని లేచాడు.

సువర్చల ముందు గదిలోకి పోయి, అక్కడ చాపపరిచి పడక తయారు

వాడి వెనకనే వెళ్ళి, తలుపు లాగి బయట గడి పెట్టేసింది. ముసలివాడు ఒకటి, రెండు క్షణాలాగి గట్టిగా అరుస్తూ తలుపు మీద బాదసాగాడు.

ఆ అర్ధరాత్రివేళ, ఈ ముసలి వెధవను పట్టుకునేందుకు ఇరుగు, పొరుగులకు నిద్రాభంగం కలిగించడం ఎందుకు, తెల్లావారాకే ఆ పని చేయవచ్చను కుంటూ, సువర్చల తన గదిలోకి వెళ్ళి పడుకున్నది.



తూర్పు తెలతెలనవుతూండగా, ఎవరో తలుపు కొట్టినశబ్దమై, సువర్చలకు మెలుకువ వచ్చింది. తన తండ్రి తిరిగి వచ్చాడనుకుంటూ, ఆమె వెళ్ళి తలుపు తెరిచింది. గడపముందు ఖరీదైన దుస్తులు ధరించి, నాజూకుగా వున్న యువకుడొకడు నిలబడి వున్నాడు.

సువర్చల అతణ్ణి చూసి, "ఎవరి కోసం వచ్చారు?" అని అడిగింది.

యువకుడు చిరునవ్వు నవ్వుతూ, "వానలో ఒక ముసలాడు ఆశ్రయం కావాలంటూ, మీ ఇంటికి వచ్చాడా?" అని ప్రశ్నించాడు.

"అవును, వచ్చాడు. ఆశ్రయం యిచ్చి, యింత భోజనం పెట్టిన నాకే కత్తి చూపించి, డబ్బు యివ్వమని బెదిరించాడు. వాణ్ణి యీ పక్క గదిలో పెట్టి గడి బిగించాను. సరే, ఇంతకూ ఆ దొంగతో మీకేం పని?" అని అడిగింది సువర్చల.

యువకుడు పెద్దగా నవ్వి, "వాడు దొంగ కాదు; మా ఇంట్లో పనివాడు," అన్నాడు.

"మీ ఇంట్లో పనివాడు, మా ఇంటికి దొంగతనానికి వస్తే—వాడు దొంగ కాక మరేం అవుతాడు?" అని ప్రశ్నించింది సువర్చల కోపంగా.

సువర్చల అంత కోపంగా ప్రశ్నించినా, యువకుడు ఇంకా చిరునవ్వుతోనే, "వాడు నిజంగా దొంగతనానికి రాలేదు. ఇదంతా ఒక చిన్న నాటకం!" అని, ఆమెకు సంగతంతా యిలా చెప్పాడు:



నూటికి నూరుపాళ్ళు నెగ్గావు!'' అన్నాడు ఎంతో సంతోషంగా.

''అదెలా?'' అన్నది సువర్చల.

యువకుడు రంగస్థలనటుడి ధోరణిలో, ''ముసలివాడిని ఆదరించడం ద్వారా, నీ ఉదారత్వం, కత్తి చూపించినా భయపడక పోవడంలో, నీ ధైర్యం, వాణ్ణి బంధించడంలో, నీ తెలివితేటలూ చక్కగా నిరూపించబడ్డాయి. నా భార్యవు కాదగ్గ యోగ్యత, నీకున్నది! ఇప్పుడు, నిన్ను పెళ్లాడడానికి, నాకెలాంటి అభ్యంతరాలూ లేవు,'' అన్నాడు.

''పనివాడిచేత ఇంత నాటకం ఆడించిన మీరు, స్వయంగానే నాటకాలాడి, మరిన్ని లక్షలు గడించవచ్చు!'' అంటూ సువర్చల పోయి, ముసలివాడున్న గది తలుపు తెరిచింది. వాడు కళ్ళు నలుపుకుంటూ బయటికి వచ్చి, తన యజమానికి కాస్త వెనగ్గా నిలబడ్డాడు.

అప్పుడు సువర్చల యువకుడితో, ''మోహనరంగంగారూ, మీరు నాకు యోగ్యతాపరీక్ష పెట్టడం, ఫలితం నిర్ణయించడం—ఈ రెండూ బుద్ధిమాలిన పనులు. ఇక వినండి! ఇలాంటి వెర్రి మొర్రి పరీక్ష పెట్టిన మిమ్మల్ని రక్షక భటులకు అప్ప చెప్పకుండా వదిలి పెడుతూన్న, నా ఉదారత్వం, ఇంత

అతడి పేరు మోహనరంగం. వారం క్రితం తన స్నేహితుడి ఇంట జరిగిన ఒక వివాహ సమయంలో, అక్కడి కొచ్చిన సువర్చలను చూశాడట. ఆమె అందం, మాటతీరూ అతడిని ఆకర్షించిందట. అయితే, లక్షాధికారులకు ఏకైక సంతానం అయిన తనను, వివాహం ఆడే యోగ్యత ఆమెకున్నదా? అన్న సందేహం అతడికి కలిగింది. యోగ్యతాపరీక్ష కోసం, ఆమె తండ్రి ఇంట లేని సమయం చూసి, తన పనివాడితో, ఈ నాటకం ఆడించాడు.

అంతా విని ఆశ్చర్యపడుతున్న సువర్చలతో యువకుడు, అదేం గమనించకుండా, ''ఈ యోగ్యతా పరీక్షలో, నువ్వు

లక్షాధికారిని తక్షణం వెళ్ళకపోతే మర్యాద దక్కదని చెప్పడం బట్టి, నా ధైర్యం, మిమ్మల్ని ససేమిరా పెళ్ళాడనని చెప్పడంలో, నా తెలివితేటలూ అంచనా వేసుకోండి. పరీక్ష పెట్టడానికూడా యోగ్యత వుండాలని తెలుసుకోండి. ఇక ఇక్కడి నుంచి కదలండి!'' అన్నది వీధి ద్వారం కేసి చేయి చూపుతూ కోపంగా.

ఆమె యిలా అనగానే యజమానీ, నౌకరూ వెలవెలపోతూ తలలు దించుకుని, ద్వారానికి కొంచెం ఎడంగా నిలబడి వున్న సువర్చల తండ్రిని తప్పుకుని బయటికి వెళ్ళిపోయారు.

అంతా విన్న ఆమె తండ్రి లోపలికి వస్తూ, ''తల్లీ, అంతతొందరపడ్డావెందుకు? అంత డబ్బున్నవాడు కోరి చేసుకుంటానని వస్తే, చీవాట్లు పెట్టడమా!'' అన్నాడు.

''అతడికి డబ్బున్నదన్న ధీమాకొద్దీ, తన ఇష్టంతో తప్ప, నా ఇష్టాయిష్టాలతో పనిలేదనుకుంటున్నాడు. నేను నచ్చాను కాబట్టి, పరీక్ష పెట్టేశాడు. ఆ రకం మనుషులు డబ్బుతోదేన్నయినా కొనివేయగల మనుకుంటారు,'' అన్నది సువర్చల.

సువర్చల తండ్రి కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, ''నా చిన్ననాటి స్నేహితుడు రామభద్రయ్యా, అతడి కొడుకు ప్రభాకరం, నీకు తెలుసుగదా?'' అని అడిగాడు.

''తెలియకేం!'' అన్నది సువర్చల.

''కబురు పెట్టగా, నేను వెళ్ళింది వాళ్ళ ఇంటికే. రామభద్రయ్య నిన్ను, తన ఇంటి కోడలుగా చేసుకోవాలనుకుంటున్నాడు. ఇందుకు, నీ అభిప్రాయం తెలుసుకోవాలన్నది, అతడి కోరిక. ప్రభాకరం యోగ్యుడు, కష్టజీవి. ఉన్న నాలుగెకరాలలో బంగారంపండిస్తున్నాడు. అతణ్ణి చేసుకోవడం, నీకిష్టమేనా?'' అని అడిగాడు రమాపతి.

ఇష్టమే అన్నట్టు సువర్చల చిరునవ్వుతో తలాడించింది. తన చిన్ననాటి స్నేహితుడు వియ్యంకుడు కాబోతున్నందుకు రమాపతి చాలా సంతోషించాడు.






# బిచ్చగాడి బీదరికం

సింధూరదేశపు రాజైన సుగుణసేనుణ్ణి, ఆయన తాత తండ్రులతో పోల్చి, గొప్ప పరిపాలకుడంటూ, నగర ప్రముఖులూ, ఆస్థాన పండితులూ పొగడుతూండేవారు.

ఒకనాడు ఆయన మంత్రి మార్తాండ వర్మ, ''మహారాజా, తమ పరిపాలన గురించి ఎందరో ప్రముఖులూ, ఆశ్రితులూ మెచ్చుకుంటున్నారు. ఒకసారి మనం స్వయంగా మారువేషాల్లో సామాన్య ప్రజల మధ్యకు వెళ్ళి, వాళ్ళు తమను గురించి ఏమనుకుంటున్నారో కూడా తెలుసుకోవడం బావుంటుంది గదా!'' అన్నాడు.

సుగుణసేనుడు యిందుకు సరే అని, ఆ మర్నాడే మంత్రితోపాటు మారువేషం ధరించి మరొక నగరానికి వెళ్ళాడు.

అక్కడ వాళ్ళిద్దరూ ఒక వీధిలో నడుస్తూండగా, బిచ్చగా డొకడు తారస పడ్డాడు.

మంత్రి రాజుకు వాణ్ణి చూపించి, ''మహారాజా, వీణ్ణి పలకరించి, తమ పరిపాలన గురించి వాడేమనుకుంటున్నాడో విందామా ?'' అని అడిగాడు.

రాజు అయిష్టంగా తలాడిస్తూ, ''ఇలాంటి బికారుల్నీ, బిచ్చగాళ్ళనూ ప్రశ్నించి, మనం తెలుసుకోగలిగినదేముంటుంది !'' అన్నాడు.

అందుకు మార్తాండవర్మ వినయంగా, ''తమ పరిపాలన గురించి ప్రజలు ఏమనుకుంటున్నారో తెలుసుకునేందుకు బయలుదేరాం. అలాంటప్పుడు, సాధ్యమైనంతలో, మన రాజ్యంలోని అన్ని వృత్తులవాళ్ళ అభిప్రాయం తెలుసుకోవడం అవసరం గదా !'' అన్నాడు.

సుగుణసేనుడు అవునన్నట్టు తలాడించి, బిచ్చగాణ్ణి, ''నువ్వు బిచ్చమెందుకు ఎత్తుకుంటున్నావు ?'' అని అడిగాడు.

జొన్నలగడ్డ రత్న



బిచ్చగాడు ఆ ప్రశ్నకు ఎంతో నిర్ల క్ష్యంగా, "అదేం మాట! బిచ్చమెందుకు ఎత్తుకోవడం ఏమిటి? ఈ పని నేను పాతికేళ్ళుగా చేస్తున్నాను," అన్నాడు.

రాజు ఆ ప్రశ్నకు సంతృప్తిపడిన వాడిలా, మంత్రితో, "వీడు మా తాతగారి కాలం నుంచీ బిచ్చగాడే!" అన్నాడు.

బిచ్చగాడు ఆ మాటలు విన్నాడు. వాడు వినుగ్గా, "అయ్యా, తమ తాతగా రెవరో, నాకు తెలియదు. కాని, పాతికేళ్ళ నుంచి యీ వృత్తిలో వున్నా, అసలైన బిచ్చగాడి అనుభవం తెలిసి వస్తున్నది, ఈ మధ్యకాలంలోనే," అన్నాడు.

"అలాగా. ఏమిటా అనుభవం?" అని అడిగాడు రాజు.

"అడిగారు కనక, ఏవో సోదె మాటలని వినుకోకుండా, వినండి. పాతి కేళ్ళ కిందట రోజూ ఒక గంటసేపు అడు క్కుంటే, జోలె నిండడమే కాక, నాలు గైదు రాగికానులు కూడా దొరికేవి. రాను రాను అలా కావడానికి రెండు, మూడు రోజులు పడుతూండేది. అయితే, ఈ మధ్య వారం రోజులపాటు పూర్తిగా వీధులన్నీ తిరిగినా, జోలే సగం కూడా నిండడం లేదు. అంతేకాక, ఎవ్వరూ ఎర్రని ఏగానీ విసిరిన పాపాన పోవడం లేదు," అని, బిచ్చగాడు తన దారిన వెళ్ళిపోయాడు.

రాజు కొంచెంసేపు ఆలోచిస్తూ వూరు కుని, మంత్రిని, "బిచ్చగాడు చెప్పింది విన్నాక—ప్రజల్లో ధర్మచింతనా, ఉపకార బుద్ధీ క్రమంగా సన్నగిల్లుతున్నాయని తెలుస్తున్నది. మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు.

అందుకు మంత్రి, "మహారాజా, బిచ్చ గాడి ఉద్దేశం, ప్రజల్లో ధర్మబుద్ధి నశించి పోతున్నదని తెలియపరచడంలా కన బడడం లేదు. ఈ పాతికేళ్ళలో, తానెంత బీదవాడైపోయిందీ, చెప్పడానికి ప్రయత్నించినట్టున్నది!" అన్నాడు.

ఆ జవాబుకు రాజు సుగుణసేనుడు ఆశ్చర్యపోయి, "అదేమిటి, మహామంత్రీ!

బిచ్చగాడు—బీదవాడై పోవడమేమిటి ?" అని ప్రశ్నించాడు.

"మహారాజా, ఆ బిచ్చగాడు, తమ తాతగారి పరిపాలనా కాలంలో, ఎంత సుఖంగా జీవించిందీ చెప్పాడు. క్రమంగా తన ఆదాయం ఎలా తగ్గుతూ వచ్చిందీ వివరించాడు. అంతే కాక, ఇప్పుడు పరిస్థితి ఎంత అధ్వాన్నమై పోయిందీ తెలియపరిచాడు," అన్నాడు మంత్రి.

"అందుకే నేను, ప్రజల్లో ధర్మగుణం, నైతికనియమాలపట్ల ఆసక్తి నశిస్తున్నదని అన్నాను," అన్నాడు రాజు.

"క్షమించండి, మహారాజా! అందుకు తగిన సాక్ష్యాధారాలు ఏమీ లేవు. మీరు భావించినట్టు జరిగి వుంటే, ఈ పాటికి రాజ్యం అంతటా మోసాలూ, దొంగతనాలూ, దోపిడీలూ చూస్తూండేవాళ్ళం. కాని, రాజ్యంలో అలాంటి అరాజకం, ఏ ప్రాంతానా లేదు," అన్నాడు మంత్రి.

"అయితే, బిచ్చగాడి ప్రస్తుత దుస్థితికి కారణం ఏమంటారు ?" అన్నాడు రాజు.

"అందుకు కారణం, ఈ పాతికేళ్ళలో ప్రజల ఆర్థికస్థితి క్రమంగా దిగజారుతుండడమే. అయినా వాళ్ళు ఎంతో సహనంతో, పరిస్థితులు మెరుగుకాగలవని నిరీక్షిస్తున్నారు. ఆ బిచ్చగాడి బీదరికం, ప్రజల బీదరికాన్ని కొలబద్దగా సూచిస్తున్నదని, అభిప్రాయపడుతున్నాను," అన్నాడు మంత్రి.

మంత్రి ఇలా చెప్పిన తరవాత, రాజు సుగుణసేనుడికి పరిస్థితి అర్థమైంది. రాజధానీనగరంలోని ప్రముఖులా, పండితులా పొగడ్తలు వింటూ, 'పరిపాలన విషయంలో తను పొరబాట్లు చేశానని గ్రహించాడు.

ఆ తరవాత ఆయన మంత్రి వెంట రాగా, రాజ్యమంతటా పర్యటించాడు. అప్పుడు సుగుణసేనుడికి ప్రజల అవసరాలేమిటో తెలియవచ్చినై. అందుకు అవసరం అయిన చర్యలు తీసుకుని, ప్రజలందరిచేతా సమర్థుడైన పాలకుడనిపించుకున్నాడు.






## 18

[శివపురం పొలిమేరల్లో చంద్రవర్మా, సేనాని ధీరమల్లుడూ కలిసి తమ సైన్యాలతో, సర్ప కేతుణ్ణి ఒకానొక కొండ కనుమలో ఎదుర్కొన్నారు. సర్పకేతుడి సైనికుల్లో చాలామంది చంద్రవర్మ కోరికప్రకారం అతని పక్షానికి వచ్చారు. సర్పకేతుడు మిగిలిన సైన్యంతో అక్కడి నుంచి పారిపోసాగాడు. చంద్రవర్మ అతడి వెంట కొందరు భటులను పంపాడు. తరవాత—]

సూర్యుడు పడమటి దిక్కుకు బాగా వాలిపోయిన తరవాత, చంద్రవర్మ పంపిన భటుల్లో ఇద్దరు తిరిగి వచ్చి, సర్పకేతుడి సైన్యం కనబడలేదనీ, కాని, కాలి గుర్తులనుబట్టి వాళ్ళు పడమటి దిశకేసి పోతున్నట్టు తెలిసిందనీ వర్తమానం తెచ్చారు.

ఈ వార్త వింటూనే చంద్రవర్మ ధీరమల్లుకేసి తిరిగి, "ధీరమల్లూ! సర్ప కేతుడు మాహిష్మతీనగరం కేసి పారిపోవటం లేదనీ, అతడు సరాసరి కంచుకోట వైపుకు ప్రయాణం కట్టాడనీ నా అభిప్రాయం," అన్నాడు.

సేనాని ధీరమల్లుడూ, సుబాహుడూ కూడా చంద్రవర్మతో ఏకీభవించారు. అయితే ఇప్పుడు తాము మాహిష్మతీనగరం కేసి వెళ్ళటమా? లేక సర్పకేతుణ్ణి అనుసరించి కంచుకోటకు వెళ్ళటమా? అన్న




సమస్య వచ్చింది. కొద్దిసేపు ఆలోచించిన మీదట కంచుకోటకు వెళ్ళి, అక్కడ సర్పకేతుణ్ణి హతమార్చటమే అన్ని విధాలా ఉత్తమ మార్గమని వాళ్ళు నిశ్చయించుకున్నారు.

వెంటనే సైనికు లందరూ పడమటి దిశగా ప్రయాణానికి సన్నద్ధం చేయబడ్డారు. కొద్దిసేపట్లో సైన్యమంతా కధిలింది. వాళ్ళు సర్పకేతుడి సైన్యం నడిచిన గుర్తుల ఆధారంతో, కొండల్లో నుంచి బయటపడి కొంతదూరం అడవి మార్గాన ప్రయాణించి, ఒక పెద్ద నది ఒడ్డుకు చేరారు. ఆ నదిని చూస్తూనే చంద్రవర్మ నివ్వెరపోయాడు. ఇంత పెద్ద సైన్యాన్ని నది దాటించటం ఎట్లా? సర్పకేతుడు నదిని ఎలా దాటగలిగాడు?

చంద్రవర్మ ఇలా మథనపడుతున్నంతలో, దాపున నున్న ఒక మహావృక్షం కొమ్మల నుంచి పెద్దగా బుసలు కొడుతూ మూడు తలల మహాసర్పం ఒకటి దభీమంటూ భూమి మీద పడింది. అందరూ భయాశ్చర్యాలతో దానికేసి చూస్తున్నంతలో, ఆ సర్పం మానవరూపం పొంది, "చంద్రవర్మా!" అంటూ ఎలుగెత్తి కేక పెట్టి, అతడికేసి పరిగెత్తుతూ వచ్చింది.

తనను పేరున పిలుస్తూ, వస్తున్న ఆకారాన్ని చూస్తూనే చంద్రవర్మ ఒక్క గెంతున ముందుకు వెళ్ళి "కాలకేతూ? నీవా!" అంటూ అతడి చేయి పట్టుకున్నాడు.

"అవును, వర్మా! నీ దయవల్ల కాలకేతుడుగా మారిన, మంత్రగత్తె కాపాలిని సేవకుడు కాలనాగును నేనే! నీ శత్రువు సర్పకేతుడు ఇంతకుముందే తన సైన్యంతో నదిని దాటిపోయాడు. అతడు నది దాటేందుకు ఉపయోగించిన తెప్ప కొయ్యలనూ, దూలాలనూ అద్దరి నుంచి యిద్దరికి చేర్చి అదుగో, ఆ కనబడే చెట్ల చాటున వున్న నది పాయలో భద్రపరిచాను." అన్నాడు కాలకేతుడు.

తరవాత అతడు చంద్రవర్మ చేయి పట్టుకుని అతణ్ణి అల్లంత దూరంలో వున్న

చెట్లచాటుకు తీసుకుపోయి, "చంద్రవర్మా! నేను నీకు సహాయం చేయాలన్న ఉద్దేశంతో శంఖుడి కొండనుంచి హుటాహుటిగా ఇక్కడికి వచ్చాను. చాలా రోజుల క్రితమే కాపాలిని చనిపోయింది. చనిపోయే ముందు ఆమె భూత వర్తమానాలను చూపే గాజుగోళాన్నీ, మానవాస్థికనూ నాకు ఇచ్చిపోయింది. వాటివల్లనే నీవు ఎలాంటి కష్టాల్లో వున్నావో నేను గ్రహించగలిగాను. ప్రస్తుతం నీ శత్రువూ—ఆ కారణంగా నా శత్రువూ కూడా అయిన సర్పకేతుడు తన సైన్యాలతో ఎక్కడ వున్నాడో చూద్దామా?" అంటూ కాలకేతుడు చెట్టుచాటు నుంచి గాజుగోళాన్ని బయటికి తీసి, మంత్రం జపిస్తూ దాన్ని మానవాస్థికతో తాకాడు. మరుక్షణంలో వాళ్ళకు ఓ అద్భుత దృశ్యం కంటబడింది.



సూర్యకాంతిలో కంచుకోట గోడలు తళతళ మెరుస్తున్నవి. కోట గోడల్లో ఉత్తర దిశగా వున్న ముఖద్వారపు పెద్ద కంచు తలుపులు బార్లా తెరవబడి వున్నవి. వాటిముందు కొద్దిమంది సైనికులు కాపలా వున్నారు. కోట లోపల శిథిల స్థితిలో వున్న అనేక భవనాలలో సర్పకేతుడి సైనికులు విచ్చలవిడిగా సంచరిస్తూ, వెల లేని రత్నాలనూ, బంగారాన్నీ అమితోత్సాహంతో కొల్లగొడుతున్నారు.

"చంద్రవర్మా! ఇవీ మన శత్రువుల గుట్టుమట్లు. చాలామంది అనుకుంటున్నట్టు కంచుకోట గోడలను సముద్ర జలం తాకటం లేదు. నూరు సంవత్సరాల క్రితం సముద్రం పొంగి కంచుకోటను జలమయంచేసి, క్రమంగా కోటగోడలను విడిచి దాదాపు ఒక కోసెడు దూరం వెనక్కుపోయింది," అన్నాడు కాలకేతుడు.

కాలకేతుడు ఇలా చెప్పగానే, చంద్రవర్మ ఎంతో ఉత్సాహంతో తన సైనికులను నది దాటేందుకు అయత్తపరిచాడు. కాలకేతుడు జాగ్రత్తపరిచిన తెప్పకొయ్యలూ, పెద్ద పెద్ద దుంగలూ ఉపయోగించి, సైనికులు నది దాటారు.

కాలకేతుడు ఒక గుర్రం ఎక్కి ముందుండి దారి చూపుతూండగా సైన్యం యాపత్తూ శరవేగంతో కంచుకోటకేసి పోసాగింది. ఒక గంట తరవాత వాళ్ళకు ఆకాశాన్నంటుతున్నవా అన్నట్టున్న కంచు కోట గోడలు తళతళ మెరుస్తూ కనిపించినై. వాళ్ళు క్రమంగా కోటను సమీపించి ఉత్తరపు వైపున వున్న కోట ద్వారాలకేసి వెళ్ళేసరికి, ద్వారాలు బంధింపబడి వున్నవి. చంద్రవర్మ సుబాహుణ్ణీ, సేనాని ధీరమల్లుణ్ణీ వెంట పెట్టుకుని ద్వారాలను సమీపించి, వాటిని పరీక్షించి చూశాడు. అవి దృఢమైన కంచుతో చేయబడి వున్నవి. ఇంత బలమైన కంచు తలుపులను బద్దలుకొట్టి, కోటలో ఎలా ప్రవేశించటమా? అని చంద్రవర్మ ఆలోచించేంతలో, కోట గోడల మీద సర్పకేతుడు బిగ్గరగా అరవటం వినబడింది. అతడి వెంట పెద్ద తట్టలూ బుట్టలూ, గోతాలూ పట్టుకుని వున్న కొందరు సైనికులు కనిపించారు.

సర్పకేతుడు తన పక్కన నిలబడి వున్న సైనికులను గోడలకింద వున్న చంద్రవర్మ సైనికులకు చూపుతూ, "ఇదిగో, నా సైనికుల దగ్గిర వున్న గోతాలూ, బుట్టలూ చూశారా? వాటినిండా రత్నాలూ, బంగారం వున్నది. చంద్రవర్మను వదిలి నా పక్షానికి వచ్చే ప్రతి సైనికుడికీ అన్ని రత్నాలూ, బంగారం ఇస్తాను. అలా నా పక్షానికి వచ్చేవారి



కోసం కోట తలుపులు తెరవబడతవి. ఈ గోతాల్లో వున్నది బంగారమవునో కాదో మీరే చూడండి!'' అన్నాడు.

సర్పకేతుడు అలా అనగానే, అతడి వెంట వున్న సైనికులు బుట్టల నుంచీ, గోతాల నుంచీ వెండి బంగారాలనూ, రత్నాలనూ చంద్రవర్మ సైనికులపై బడేలా కుమ్మరించారు. చంద్రవర్మ సైనికులు వాటికోసం కొట్లాడుతూ, ఒకరి నొకరు కుమ్ముకో సాగారు. పరిస్థితి ప్రమాదకరంగా పరిణమిస్తున్నదని గ్రహించిన చంద్రవర్మ, సుబాహుడితో, ''సుబాహూ! నువ్వు మన వీరపుర సైనికులను వెంట బెట్టుకుని, శత్రుపక్షంలో చేరేవాడిలా నటిస్తూ కోట తలుపులు తెరవమని కేకలు పెట్టు. అది నమ్మి సర్పకేతుడు తలుపులు తెరిపించేట్టయితే, వెంటనే కోటలో జొరబడు. నేనూ, ధీరమల్లుడూ మిగిలిన సైన్యంతో నీ వెనుకనే వస్తాం. అప్పుడు ఒక్కుమ్మడిగా అందరం కలిసి శత్రువుల మీద పడి వాళ్ళను సర్వనాశనం చేద్దాం.'' అన్నాడు.

చంద్రవర్మ యిలా చెప్పగానే సుబాహుడు సైనికుల దగ్గిరకు వెళ్ళి, వాళ్ళతో రహస్యంగా మాట్లాడాడు. చూస్తూండగానే సైన్యంలో నుంచి ఒక పెద్ద భాగం వేరుపడి, ''సర్పకేత మహారాజుకూ, జై!'' అంటూ వేగంగా కోట తలుపులకేసి కదిలింది. వాళ్ళు ముందుకు పోకుండా అటకాయించే వాళ్ళలా కొందరు సైని





కులు వాళ్ళతో ఉత్తుత్తి యుద్ధం ప్రారంభించారు.

చంద్రవర్మ సైన్యంలో తిరుగుబాటు వచ్చిందని నమ్మిన సర్పకేతుడు కోట గోడల మీది నుంచి వికటాట్టహాసం చేస్తూ, "కోట తలుపులు తెరవండి! శత్రు సైన్యంలో ఎక్కువ భాగం మన పక్షమైంది. చంద్రవర్మనూ, వాడి ముఖ్యానుచరులనూ క్షణాల మీద నా కత్తికి ఎర చేస్తాను!" అని కేకలు పెట్టాడు. ఆ వెంటనే సర్పకేతుడి సైనికులు కోట తలుపులను తెరిచారు.

ఆ తరవాత కన్ను మూసి తెరిచేంతలో జరిగిపోయిందా, అన్నంత ఆశ్చర్యకరంగా సర్పకేతుడి సైన్యం తుడిచిపెట్టబడింది. సైనికులతో కోటలో ప్రవేశిస్తూనే సుబాహుడు ఎదురైన శత్రుసైనికులను తన కత్తితో నరకసాగాడు. అంతలో చంద్రవర్మ, ధీరమల్లుడూ కూడా కంచుకోటలో ప్రవేశించారు. వారి ధాటికి సర్పకేతుడి సైన్యం చెల్లాచెదురుగా పారిపోసాగింది.

జరిగిన మోసం చూసి సర్పకేతుడు నిలువెల్లా భగ్గుమన్నాడు. అతడు కోట గోడలమీద తన వెంటవున్న కొద్దిమంది సైనికులను హెచ్చరించి, అక్కడ వున్న పెద్దపెద్ద బండరాళ్ళను ఎత్తి, దిగువనున్న చంద్రవర్మ సైనికులమీదికి విసరసాగాడు. అది చూసిన చంద్రవర్మ, సుబాహుడితో, "సుబాహూ! ఆ దుష్టుణ్ణి సాధ్యమైతే ప్రాణాలతో పట్టుకో. అలా సాధ్యం కాని పరిస్థితుల్లో వెంటనే నీ కత్తితో తునాతునియలుగా నరుకు!" అని కేకపెట్టాడు.

సుబాహుడు కొందరు సైనికులను వెంటపెట్టుకుని కూలిపోయిన కోటగోడ రాళ్ళమీదుగా పాకి, గోడ పైభాగానికి వెళ్ళాడు. కాని, సర్పకేతుణ్ణి పట్టుకోవటం సాధ్యమయేలా అతడికి కనిపించలేదు. తనకు ఎలానూ చావు తప్పదని నిశ్చయించుకున్న సర్పకేతుడు రాక్షసుడిలా బొబ్బలు పెడుతూ, ఎదురైన సైనికులను

తన కత్తితో ఊచకోత కోస్తున్నాడు. కోట గోడలమీద సుడిగాలిలా ఇటు నుంచి అటు పరుగెత్తుతూ, అతడు చేసే బీభత్సాన్ని చూసి చంద్రవర్మ సైనికులు వణికిపోయారు.

"చంద్రవర్మా! సర్పకేతుడికి సరి అయిన ప్రతియోధుణ్ణి నేను! వాడు కోట గోడలమీదినుంచి, పెను శిలలా కింద పడబోతున్నాడు. ప్రాణాలతో వాణ్ణి బంధించ దలిస్తే, వాడు భూమిని తాకి ముక్కలు కాకముందే జాగ్రత్తపడి పట్టుకో!" అంటూ కాలకేతుడు కత్తి దూసి ఒక్క ఎగురున కోట గోడలమీదికి వెళ్ళాడు.



కాలకేతుణ్ణి చూస్తూనే, సర్పకేతుడు పెద్దగా రంకె వేసి అతడిమీదికి దూకాడు. కాలకేతుడు అతడి కత్తి దెబ్బను తప్పుకుని, తన కత్తిని ముందుకు సాచి అతడి మీదికి లంఘిస్తూ, "సర్పకేతూ! నువ్విప్పుడు పోరాడుతున్నది కాలకేతుడితో! కాలకేతుడంటే మూడు శిరస్సుల మహా కాలసర్పం!" అంటూ చటుక్కున సర్పాకృతి దాల్చి, బుస్సుమంటూ పైకి లేచాడు.

సర్పకేతుడు ఒక్క క్షణకాలం స్తంభించిపోయి, ఆ వెంటనే ప్రాణ భీతితో కీచుమంటూ అరిచి కోట గోడల మీదినుంచి తలకిందులుగా కిందికి పడిపోయాడు. చంద్రవర్మ సమీపించే సరికే, అతడి ప్రాణంపోయింది. దానితో చావగా మిగిలిన సర్పకేతుడి సైనికులు చంద్రవర్మకు లొంగిపోయారు.

* * *

కాలకేతుడు తాను కంచుకోటలో నివాసం ఏర్పరుచుకునేందుకు అనుమతి కోరగా, చంద్రవర్మ అందుకు అంగీకరించాడు. ఆ రాత్రి తన సైనికులతో అతడు కంచుకోట శిథిలాలలో కాలం గడిపి, అక్కడ దొరికిన ధనరాసులతో, తెల్లవారగానే రుద్రపురం వైపుకు ప్రయాణమయాడు. ఒకటి రెండు రోజుల

ప్రయాణం తరవాత రుద్రపురవాసులు కొందరు చంద్రవర్మ దగ్గిరకు వచ్చి, రాజు శివసింహుడు కొండల్లోకి పారిపోయాడనీ, ఇప్పుడు తమకు రాజు లేడనీ విన్నవించుకున్నారు. చంద్రవర్మ, ముసలివాడి కొడుకు దేవలుణ్ణి రుద్రపుర రాజుగా నియమించాడు.

చంద్రవర్మ మాహిష్మతీ నగరానికి కొన్ని కోసుల దూరంలో వుండగానే, నగరవాసులకు క్రూరుడైన సర్పకేతుడి చావును గురించి తెలిసింది. వాళ్ళు మంగళ వాయిద్యాలతో బయలుదేరి, చంద్రవర్మకు ఎదురువచ్చి, అతణ్ణి తమకు చక్రవర్తిగా వుండవలసిందని కోరారు. కాని, చంద్రవర్మ అందుకు అంగీకరించలేదు. యశోవర్ధన చక్రవర్తి పెద్ద కుమారుడు తపోవర్ధనుడు చక్రవర్తి కావటం ఉత్తమంగా వుంటుందని అతడు వారికి తెలియపరిచాడు.

మాహిష్మతీ నగర పరిసరారణ్యాల్లో ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చేసుకుంటున్న తపోవర్ధనుడి దగ్గిరకు చంద్రవర్మతోపాటు నగరవాసులు కూడా వెళ్ళి, ఆయనను సింహాసనం అధిష్ఠించవలసిందిగా కోరారు. తపోవర్ధనుడు దానికి అంగీకరించక, "నేనేనాడో సర్వసంగ పరిత్యాగం చేసినవాణ్ణి. నాకు రాజ్యకాంక్ష లేదు. మీ అందరి గౌరవాదరణలకూ, ప్రేమాభిమానాలకూ పాత్రుడైన చంద్రవర్మ మీకు చక్రవర్తిగా వుండటం అన్ని విధాలా మంచిదని నేను భావిస్తున్నాను," అన్నాడు.

తరవాత ప్రజల కోరికను మన్నించి, తపోవర్ధనుడు స్వయంగా కిరీటాన్ని చంద్రవర్మ శిరస్సున పెట్టాడు. ప్రజలు పరమానందంతో, జయజయ ధ్వానాలు చేశారు.

చంద్రవర్మ, తనకు విశ్వాసపాత్రులైన ధీరమల్లు, సుబాహులకు ముఖ్యమంత్రి పదవీ, ముఖ్య సేనాని పదవీ యిచ్చి, ప్రజానురంజకంగా ఎంతో కాలం రాజ్యపాలన చేశాడు. —(అయిపోయింది)






# అక్కచెల్లెళ్ళు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, నువ్వెవరి కోసమో నిస్వార్థ సేవ చేస్తున్నావన్న శంక కలుగుతున్నది. కాని, కొన్ని కొన్ని సందర్భాల్లో ఏది స్వార్థమో, ఏది నిస్వార్థమో తెలుసుకోవడం చాలా కష్టతరమైన కార్యం. ఎంతో గొప్ప మహిమాన్వితుడని అందరూ కొనియాడే జ్ఞానశిఖుడనే మహాయోగే, ఈ విషయంలో పొరబాటు చేసి, ఒక నిర్దోషికి మనస్తాపం కలిగించాడు. నీకు శ్రమ తెలియకుండా వుండేందుకు, ఆ కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



కరవీర రాజ్యంలో ధర్మవీరుడనే సామంతు ఉండేవాడు. ఆయనకు ఇద్దరు కుమార్తెలు నర్మద, నీరద. ఇద్దరూ సౌందర్యవతులే అయినప్పటికీ నీరద, నర్మద కన్నా మరింత సౌందర్యవతి. గుణంలో కూడా నీరద, నర్మద కంటే ఎక్కువ కాంక్షా స్వభావం కలది. ధనం, అధికారం, అలంకారాల మీద నర్మద కన్న నీరదకు ఆసక్తి ఎక్కువ.

ఒకనాడు పద్మకేతుడనే గంధర్వుడు, ఆకాశమార్గాన పోతూ, ఒంటరిగా వన విహారం చేస్తున్న నర్మదను చూసి, దిగి వచ్చి ఆమెను, "సుందరీ!" అంటూ మెల్లిగా పిలిచాడు.

నర్మద ఆ పిలుపు విని, పద్మకేతుడి కేసి తిరిగి చూసి, చాలా ఆశ్చర్య పోయింది.

అది గమనించిన పద్మకేతుడు, ఆమెతో, "నేను పద్మకేతుడనే గంధర్వుణ్ణి. ఆకాశమార్గాన పోతున్న నన్ను, నీ సౌందర్యం ఆకర్షించి, ఇటు రప్పించింది. అభ్యంతరం లేకపోతే, నిన్ను పెళ్ళాడతాను," అన్నాడు.

ఆ మాటలు విని మరింత ఆశ్చర్య పోయిన నర్మద, ఒక క్షణకాలం పూరు కుని, తర్వాత, "తమరు హఠాత్తుగా ఇలా ప్రశ్నిస్తే, నేనేమని జవాబివ్వగలను? రేపు సాయంత్రం వరకు, నాకు గడువివ్వండి," అని కోరింది.

ఆ మరుక్షణం పద్మకేతుడు, అందుకు సరేనని వెళ్ళిపోయాడు.

ఆ క్షణం నుంచీ, రాత్రి పొద్దుపోయే వరకూ నర్మద, అతణ్ణి గురించిన ఆలోచనలతో సతమతమయింది. చివరకు ఒక నిర్ణయానికి వచ్చి తృప్తిపడి, హాయిగా నిద్రపోయింది.

మర్నాడు యథాప్రకారం వనవిహారం చేస్తున్న నర్మద వద్దకు, పద్మకేతుడు వచ్చాడు.

నర్మద అతడితో వినయంగా, "మీ రడిగిన దాన్ని గురించి బాగా ఆలో

చించాను. నా సమాధానం ఏమిటో విన బోయే ముందు, అదుగో, ఆ మాలతీలత వెనక వున్న చంద్రశిల మీద, నా చెల్లెలు నీరద కూర్చుని వుంటుంది. ఆమెను చూసి రండి!'' అన్నది.



పద్మకేతుడు అటు కేసి వెళ్ళాడు. అక్కడ చంద్రశిలపై కూర్చునినీరద పూల మాల అల్లుతున్నది. ఆమెను చూస్తూనే పద్మకేతుడు, ఆమె సౌందర్యానికి మరింతగా ఆకర్షితుడయాడు.

ఆ వెంటనే అతడు, నర్మదను మరిచి పోయి, నీరదను సమీపిస్తూ, ''సుందరీ!'' అని పిలిచాడు.

తల ఎత్తి అతడికేసి చూసిన నీరద, సంభ్రమాశ్చర్యాలకు లోనయింది.

పద్మకేతుడు నవ్వుతూ, ''సుందరీ, నేను పద్మకేతుడనే గంధర్వుణ్ణి. నీవంటి సౌందర్యవతులు, మా లోకంలో గాలించినా కనబడరు. నీకు అభ్యంతరం లేక పోతే పెళ్ళాడతాను,'' అన్నాడు.

అతడి మాటలకు ఉబ్బితబ్బిబ్బయిన నీరద, వెంటనే అతడికి తన అంగీకారాన్ని తెలియజేసింది. పద్మకేతుడు సంతోషించి, అక్కడే, అప్పుడే గాంధర్వ వివాహం చేసుకొందామన్నాడు.

నీరద అందుకు అంగీకరించక, ''అలా అయితే, నా వివాహం ఎవరికీ తెలియని రహస్యంగా వుండిపోతుంది. అత్యంత వైభవంగా వివాహం చేసుకోవాలని, నా కోరిక. మన విషయం, నా తండ్రికి చెబుతాను. అలంకరించిన కళ్యాణమండపంలో, వివాహం చేసుకుందాం,'' అన్నది.

పద్మకేతుడు, ఆమె కోరికకు అంగీకరించి, మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళి పోయాడు. నీరద అమితానందంతో అంతఃపురం చేరుకున్నది. తర్వాత జరిగినదంతా నర్మదకు చెప్పి పరవశించిపోయింది.

అయితే, నర్మద మాత్రం ఏమీ సంతోషించక, ''చెల్లీ, జరిగినదంతా, నాకు తెలుసు! ఈ విషయంలో, నీ కొక సలహా ఇవ్వదలిచాను,'' అన్నది.



నీరద అక్క మాటల్లో, అట్టే ఆసక్తి కనబరచకుండా, "ఏమిటది ?" అన్నది.

"ఈ పద్మకేతుడు మొదట నన్ను చూసి పెళ్ళాడతానన్నాడు. అతడి మీద నమ్మకం లేక, అతణ్ణి పరీక్షించడానికే నిన్ను చూపించాను. నిన్ను చూడగానే, నన్ను పూర్తిగా మరిచిపోయి, నిన్ను పెళ్లాడతానన్నాడు. దీన్నిబట్టి, ఆ గంధర్వు డెంతటి చపలచిత్తుడో తెలియడం లేదా ? అటువంటి వాణ్ణి పెళ్ళాడి, నీ జీవితం నాశనం చేసుకోకు." అన్నది నర్మద.

అక్క మాటలకు నీరద తేలిగ్గా నవ్వేసి, "గంధర్వుడంతటివాడు, పెళ్ళాడతానని వస్తే, కాదనడమా ? దీన్నే పెద్దలు సిరిరా మోకాలడ్డడమంటారు ! విధి రాతను ఎవ్వరూ తప్పించలేరు గదా అక్కా. లేని పోని అనుమానాలతో, వచ్చిన అదృష్టాన్ని కాలదన్నలేను," అన్నది.

తర్వాత నెల గడవకుండానే నర్మదకు, ఒక సామంతుడి కుమారుడితోనూ, నీరదకు, పద్మకేతుడితోనూ వైభవంగా వివాహాలు జరిగాయి. నర్మద హాయిగా కాపురం చేసుకుంటున్నది. కాని, నీరద కాపురం మాత్రం మూడు రోజుల ముచ్చటే అయింది. ఒకనాడు, ఆమెను వదిలి వెళ్ళిన గంధర్వుడు తిరిగి రాలేదు. నీరద బాధాపమానాలతో కృంగిపోయింది. చెల్లెలి పరిస్థితి చూసి, నర్మద బాధపడసాగింది.

ఇలా వుండగా, వాళ్ళున్న ఊరుకు కరవీరరాజ్యంలో, మహా తపశ్శాలిగా పేరు గాంచిన జ్ఞానశిఖు డనే యోగి వచ్చాడు. నర్మద చెల్లెలిని వెంటబెట్టుకుని, ఆయన దర్శనానికి వెళ్ళింది.

జ్ఞానశిఖుడు, నర్మద చెప్పినదంతా విని, "నర్మదా, నువ్వు స్వార్థబుద్ధితో, అతి తెలివిగా ప్రవర్తించావు," అన్నాడు, ఆమె కేసి తీవ్రంగా చూస్తూ.

నర్మద ఏమని జవాబివ్వాలో తోచక, తల వంచుకున్నది.

తర్వాత జ్ఞానశిఖుడు, నీరదతో, "అమ్మా, నీకొక మంత్రం ఉపదేశిస్తాను.

దాన్ని జపిస్తూ, శక్తిస్వరూపిణి అయిన పార్వతీదేవిని ఉపాసించు. నీ కాపురం చక్కబడుతుంది,'' అని, ఆమెకు మంత్రోపదేశం చేశాడు.

కొద్ది రోజులకే నీరద ఉపాసన ఫలించి, పద్మకేతుడు ఆమెవద్దకు తిరిగి రావడమే కాక, రెట్టింపు అభిమానంతో చూడ సాగాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, తనను పెళ్ళాడవచ్చిన గంధర్వుణ్ణి, చెల్లెలు పెళ్ళాడినా బాధపడని వ్యక్తి నర్మద. అటువంటిదాన్ని, స్వార్థపరురాలని జ్ఞానశిఖుడు నిందించాడు. ఇది అధర్మం, న్యాయవిరుద్ధం అనిపించుకోదా? ఇందుకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఆ అక్క చెల్లెళ్ళలో నీరద స్వభావతః అమాయకు రాలు, కోరికలను అదుపులో వుంచుకో లేనిది. అందుకు ఆమెపట్ల జాలిచూపాలి తప్ప, ద్వేషించడం సరికాదు. ఇక నర్మద సంగతి; ఆమె చాలా తెలివైనది. అందుకే పద్మకేతుడికి తన సమ్మతి తెలిపేముందు, అతడి స్వభావాన్ని అంచనా కట్టేందుకు, తన సొంత చెల్లెలినే ఎరగా ఉపయో గించుకున్నది! అతడు నీరదవల్ల ఆకర్షి తుడు కావచ్చునీ, నీరద కూడా అతణ్ణి పెళ్ళాడేందుకు అంగీకరించవచ్చునీ, నర్మద ఊహించింది. ఒకవేళ పద్మ కేతుడు చపలచిత్తుడైతే, అతణ్ణి పెళ్ళాడి తాను ఎలాంటి బాధలకు గురి అవు తుందో, అవే బాధలు తన చెల్లెలు పడవలసి వస్తుందన్న సంగతి—ఆమెకు తెలియంది కాదు. అందువల్లనే, జ్ఞాన శిఖుడు ఆమెను స్వార్థపరురాలని నిందిం చాడు. ఇందులో ఆయన అధర్మంగా, న్యాయవిరుద్ధంగా ప్రవర్తించినదేమీ లేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# గుణపాఠం

విరించిపట్టణం రాజవీధిలో, కొత్తగా వెచ్చాలవ్యాపారం ప్రారంభించిన వరదయ్య, దుకాణంలో తనకు సాయపడడానికి, తగిన పనివాడి కోసం వెతుకుతున్నాడు. ఈ సంగతి షావుకారు శరభయ్య దుకాణంలో జీతగాడుగా వుంటున్న జోగయ్యకు తెలిసింది.

అతడు వరదయ్య దగ్గిరకు వచ్చి, తనకు దుకాణంలో పని ఇవ్వవలసిందిగా అడిగాడు. వరదయ్య, అతణ్ణి ప్రస్తుతం ఎక్కడ పని చేస్తున్నావని ప్రశ్నించాడు.

అందుకు జోగయ్య, తను శరభయ్య దగ్గిర పని చేస్తున్నట్టు చెప్పి, జీతం అక్కడికన్న మరొక పది రూపాయిలు యిస్తే, వరదయ్య దగ్గిర పనికి చేరగలనన్నాడు.

వరదయ్య కొంచెంసేపు ఆలోచించి, జోగయ్యతో, ''నిన్ను పనిలో పెట్టుకోవడానికి నేను సిద్ధమే. అయితే, నువ్వు ఆ శరభయ్య దగ్గిర ఇప్పుడు చేస్తున్న పని ఎందుకు మానుకోవాలనుకుంటున్నావో, నిజం చెప్పాలి. జీతంలో మరొక పది రూపాయిల పెరుగుదలకోసం, నువు అక్కడ పని మానేస్తున్నావంటే, నేను నమ్మను,'' అన్నాడు.

"అయ్యా, ఇందులో దాపరికమెందుకు. శరభయ్యగారి దగ్గిర పని చెయ్యడమంటే, కత్తి మీద సాములాంటిది. ఊఁ అన్నా, ఆఁ అన్నా ఆయనకు అపరాధం లాగే కనబడుతుంది. నే చేసే ఉద్యోగం తుమ్మితే ఊడే ముక్కు లాగా వున్నది,'' అన్నాడు జోగయ్య.

వరదయ్య పని యిచ్చేదీ లేనిదీ తర్వాత చెబుతానని జోగయ్యను పంపేసి, అప్పటికప్పుడే తిన్నగా శరభయ్య దుకాణానికి వెళ్ళి, ఆయనతో, ''మీ దుకాణంలో పని

కమలిని

చేసే జోగయ్యకు పిల్లనిస్తామని, మా ఊరు నుంచి ఒకరు వచ్చారు. మీరు, ఆ కుర్రవాణ్ణి గురించి తెలిసినదంతా చెప్పాలి,'' అన్నాడు.

ఆ వెంటనే శరభయ్య, ''జోగయ్య మెరికలాంటివాడు. చాలా నమ్మకస్థుడైన కుర్రాడు. అతడు ఎన్నాళ్ళుగానో వ్యాపారంలో నాకు కుడిభుజంలా వుంటున్నాడు. ఇది నా మాటగా, ఆ పిల్లనివ్వవచ్చిన పెద్ద మనిషికి తప్పకుండా చెప్పండి,'' అన్నాడు.

ఆ జవాబుకు వరదయ్య నవ్వి, ''జోగయ్యను, మీరంత అభిమానిస్తూ పొగడుతున్నారు. కాని, అతడు మాత్రం మీ దగ్గిర పని చెయ్యడం అంటే మాటలు కాదనీ, కత్తి మీది సాములాంటిదనీ అంటున్నాడు. మీరిచ్చే జీతం కన్న పది రూపాయిలు ఎక్కువ యిస్తే, నా దగ్గిర పనికి కుదురుతానని చెప్పి వెళ్ళాడు,'' అన్నాడు.

''మరి, మీ ఊరివాళ్ళెవరో అతడికి పిల్లనిస్తామని రావడం—అదంతా ఏమిటి? మీ కల్పనా ?'' అని అడిగాడు శరభయ్య.

''జోగయ్యను గురించి నిజం రాబట్టేందుకు, మీతో అలా అన్నాను. అతడికి మీపట్ల కొద్దిపాటి సదభిప్రాయం కూడా లేదని తేలిపోయింది,'' అన్నాడు వరదయ్య.

ఆ మాటలు వింటూనే శరభయ్య వరదయ్య కేసి కొరకొరా చూస్తూ, ''మీరు



తెలుసుకోవాలనుకున్నది. జోగయ్య విష యంలో, నా అభిప్రాయం ఏమిటనేగదా? అదేమిటో మీకు స్పష్టంగా చెప్పాను. అయితే, మీరు మాత్రం, జోగయ్యకు నా మీద వున్న అభిప్రాయం ఏమిటో, నేను అడగకుండానే చెప్పారు. అతడు నన్ను గురించి ఏమనుకుంటున్నా, అతడిపట్ల, నాకున్న అభిప్రాయంలో మాత్రం ఎటు వంటి మార్పు రాదు. ఇక మీరు వెళ్ళ వచ్చు," అన్నాడు.

"మీ ధోరణి నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది," అన్నాడు వరదయ్య.

"ఇందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. మీకు అంతగా పనివాడి అవసరం వుంటే ఆ జోగయ్యకు నాకన్న పది కాదు, ఇరవై ఎక్కువ యిచ్చి జీతానికి పెట్టు కోండి. నా అభ్యంతరం ఏమీ లేదు. అతడు చాలా చురుకైనవాడు; నమ్మ కస్థుడు. అది నా దృఢమైన అభి ప్రాయం," అన్నాడు శరభయ్య మంద లిస్తున్నట్టుగా.

వరదయ్య మారుమాట్లాడకుండా తల వంచుకుని అక్కడి నుంచి వెళ్ళి పోయాడు.

దుకాణం తలుపుపక్కన వుండి, ఈ సంభాషణ అంతా విన్న జోగయ్య, లోపలికి వస్తూనే శరభయ్య కాళ్ళ మీద పడి, "అయ్యా, ఒక మనిషి విశ్వాసాన్నీ, అభిమానాన్నీ సంపాయించడంకన్న మించిన ఆర్జన లేదని, ఇప్పుడు తెలుసు కున్నాను. అవసరాలకూ, పరిస్థితులకూ అనుగుణంగా అభిప్రాయాలు మార్చుకుని బతకవచ్చుననుకునే, నాలాంటి వాళ్ళకు చక్కని గుణపాఠం నేర్పారు. నన్ను క్షమించండి!" అన్నాడు.

ఆ తరవాత జోగయ్య, శరభయ్య దగ్గిర ఎన్నో సంవత్సరాలు నమ్మకంగా పని చేశాడు. క్రమంగా అతడికి ఆయన ద్వారా వ్యాపారంలోని మెలకువలు తెలిసివచ్చినై. శరభయ్య ప్రోత్సాహంతో, అతడు సొంతంగా వ్యాపారం ప్రారంభించి వృద్ధిలోకి వచ్చాడు.






మన దేవాలయాలు :

# తిరుపతి

నారదుడు ఒకసారి మహావిష్ణువును సందర్శించి, భరతఖండం తూర్పు కనుమలలో వెలసే ఏడుకొండల శేషాచల ప్రకృతి సౌందర్యం గురించి తెలియజేశాడు.

కొన్నాళ్ళ తరవాత, విష్ణువు పరిసరాల మార్పుకోసం శేషాచలం మీదికి దిగాడు. అద్భుతమైనఆక్కడిప్రకృతిసౌందర్యం చూసి పరమానందం చెందాడు. ఒక బండ మీద కూర్చుని ధ్యానంలో నిమగ్నుడయ్యాడు.





కొంత కాలానికి విష్ణువు ఆ స్థలాన్ని వదలి వెళ్ళిన తరవాత కూడా, ఆ బండ మీద ఆయన విగ్రహరూపం స్థిరపడి పోయింది. ఆ విగ్రహంలో విష్ణువు దివ్యాంశ కూడా నిలిచిపోయింది. కాల క్రమేణా విగ్రహం చుట్టూ చెట్టు చేమలూ, పుట్టలూ పెరగసాగాయి.




ఆ ప్రాంతాలలో ఒక పశువుల కాపరి, తన మంద నుంచి ఒక గోవు రోజూ క్రమం తప్పకుండా, ఒక కొండ మీదికి వెళ్ళి రావడం గమనించాడు. ఆ గోవు, ఇంటి దగ్గర ఇవ్వవలసిన పాలు ఇచ్చేది కాదు. దాని అంతు తెలుసుకోవాలని, పశువుల కాపరి ఒకనాడు దానిని వెంబడించాడు.

ఆ ఆవు కొండ ఎక్కి, ఒక పొద చాటున నిలబడగానే, దాని పొదుగు నుంచి పుట్టలోని విగ్రహం మీదికి పాలు ధారలు ధారలుగా కారడం చూసిన పశువుల కాపరి, ఆమితాశ్చర్యం చెంది, దానిని సమీపించడానికి ధైర్యం లేక, పరుగు పరుగున కొండ దిగి వచ్చాడు.





పశువులకాపరి తాను చూసిన విష యాన్ని, రాజుకు తెలియజేశాడు. రాజు కొండ మీదికి వెళ్ళి, పుట్టలోని విష్ణు విగ్రహాన్ని కనుగొన్నాడు. దాపుల నున్న మరొక కొండ శిఖరం మీద ఆ విగ్ర హాన్ని ప్రతిష్ఠించి ఆలయం నిర్మిం చాడు. ఒక గొప్ప శిల్పి, ఆ విగ్రహాన్ని మరింత విలక్షణంగా తీర్చిదిద్దాడు.

ఏడుకొండల వేంకటేశ్వరుడుగా ప్రసిద్ధి గాంచిన విష్ణువును వివాహమాడడానికి, లక్ష్మీదేవి ఆకాశరాజు ఇంట, సౌందర్య రాశి అయిన పద్మావతీదేవిగా అవతరించింది.






వేంకటేశ్వరుడు ఒకనాడు మానవ రూపంలో అరణ్యంలో సంచరిస్తూండగా, పద్మావతీదేవిని చూశాడు. ఆ దివ్య దంపతులు ఒకరినొకరు తెలుసుకుని, తమ వివాహాన్ని భూలోకంలో మరొకసారి జరుపుకున్నారు. తిరుమల పాదతలంలోని ఆలయంలో పద్మావతీ దేవి, భక్తులచేత పూజింపబడుతున్నది.

మన దేశంలోని సుప్రసిద్ధ దేవాలయాలలో ప్రధానమైనది తిరుపతి. పలువురు రాజులు, ఆలయ పునర్నిర్మాణానికీ, దేవాలయ ప్రాంగణాన్ని విస్తరింపజేయడానికీ కృషి చేశారు. ఆలయ గోపుర విమానం బంగారు రేకులతో కప్పబడి ఉన్నది.





అనునిత్యం దేశం నలుమూలల నుంచీ భక్తులు తండోపతండాలుగా దేవాలయ దర్శనానికి వస్తూ, హుండీలో కానుకలు చెల్లిస్తూ ఉంటారు. భక్తుల నుంచి వచ్చే నిధులతో అనేక విద్యాసంస్థలు, ఆరోగ్య కేంద్రాలు, ధర్మకార్యాలు నిర్వహింప బడుతున్నాయి.

సీతారామలక్ష్మణులు ఈ దివ్యస్థలంలో కొంతకాలం నివసించినట్టు పురాణాలు పేర్కొంటున్నాయి. వారు నివసించిన ప్రదేశాన్ని స్వామితీర్థం అంటారు. విష్ణువు దివి నుంచి భువికి దిగిన సుందర శిఖరం మీద విష్ణువు పాదపద్మాలు చెక్కబడిన శిలాఫలకం ఒకటి ఉన్నది!






ఈ దేవాలయంలోని స్వామి విగ్రహం, దివ్యప్రేమను వెదజల్లే మందహాసంతో, అత్యద్భుతంగా వెలుగొందుతున్నది. విగ్రహం అంతా మణిమాణిక్యాల తోనూ, విలువైన ఆభరణాలతోనూ అలంకరించబడి ఉన్నది. ఏడు కొండల వెంకటేశ్వరుణ్ణి దర్శించడం, భుక్తి, ముక్తి దాయకమని భక్తులు విశ్వసిస్తారు.



# అదృష్టదేవత

ఆఫ్రికాదేశంలో ఒక బెస్తవాడుండేవాడు. వాడు ఒక పెద్ద సరస్సులో చేపలు పట్టే వాడు. చేపలను పట్టటానికిగాను వాడు పెద్ద పెద్ద పళ్ళికలలాటి ఊతలు ఉపయోగించేవాడు. వాడు తన తెప్పలో ఈ ఊతలను పట్టుకుపోయి, సరస్సు అటే లోతు లేని చోట వాటిని తాళ్ళు కట్టి దించేవాడు. తాళ్ళ చివర కర్ర ముక్కలు కట్టటం చేత అవి పైకి తేలి, ఊతలు ఎక్కడెక్కడ ఉన్నదీ వాడికి సులువుగా తెలిసేది. ఇంటికి వెళ్ళేటప్పుడు ఈ ఊతలన్నిటినీ పైకి లాగి, వాటిలో చిక్కిన చేపలతో పొట్ట పోసుకునేవాడు.

ఒకనాడు బెస్తవాడు తన ఊతలను ఒక్కొక్కటిగా పైకి లాగసాగాడు. రెండు ఊతల్లో ఒక్క చేప కూడా లేదు. మూడో దానిలో ఒక చిన్న ఎండ్రకాయ మాత్రం ఉన్నది. కాని నాలుగోది చాలా బరువుగా పైకి లేచింది. "అమ్మయ్య, నా అదృష్టం పండింది! నా దరిద్రం తీరిపోయింది!" అనుకుంటూ వాడు ఆ ఊతను తెప్ప మీదికి లాక్కున్నాడు. అందులో, ఎండి వరడు గట్టిన ఒక ముసలిది మాత్రం ఉన్నది!

బెస్తవాడి ఆశ్చర్యం క్షణంలో అసహ్యంగా మారింది. వాడా ముసలిదాన్ని మళ్ళీ సరస్సులోకి తొయ్యబోయాడు. కాని ఆమె వాడితో, "మళ్ళీ నన్ను నీటిలోకి తోసెయ్యకు, బాబూ. నీ వెంట నన్ను మీ ఇంటికి తీసుకుపో. నీకేమీ నష్టం ఉండదులే," అన్నది.

"నిన్ను మా ఇంటికి తీసుకుపోనా? తాను దూర కంత లేదు, మెడకు డోలన్నట్టుగా, నేనే పొట్ట పోసుకోలేక చస్తుంటే నిన్ను కూడా ఎక్కడ పోషించేది?" అన్నాడు బెస్తవాడు.

ఆఫ్రికా జానపద కథ



కాని ముసలిది కాళ్ళా వేళ్ళా పడి, వాణ్ణి వదిలిపెట్టక వాడి ఇంటికి వెళ్ళింది. వాడు అయిష్టంగా తన కూడులో నుంచే కొంత ముసలిదానికి కూడా పెట్టాడు. ఇద్దరూ తిండి తిన్నాక వాడు, ముసలి దానితో, "నాకేదో లాభం కలుగుతుందంటివే, ముసలితొక్కా? ఆ లాభం ఏమిటో స్పష్టంగా చెప్పు. విని సంతోషిస్తాను," అన్నాడు.

"రేపు సాయంకాలం లోపల నువ్వొక పశువుల మందకు యజమాని కాబోతున్నావు. అందుచేత విశాలమైన పశువుల దొడ్డి ఒకటి తయారు చేసుకో," అన్నది ముసలిది.

బెస్తవాడు ఏవేవో అడిగాడు కాని ఆమె, "నేను చెప్పినట్టు చెయ్యి," అన్నది.

బెస్తవాడు తనలో తాను గొణుక్కున్నాడు. అయినా, వాడు మర్నాడల్లా శ్రమ పడి చుట్టూ ముళ్ళ కొమ్మలతో బలమైన కంచె కట్టి, పశువుల దొడ్డి తయారు చేశాడు. అది పూర్తి అయేసరికి సూర్యాస్తమయం కావచ్చింది.

ఈ పని పూర్తి అయిన మరుక్షణమే సరస్సు దిక్కు నుంచి పశువుల అరుపులు వినవచ్చాయి. త్వరలోనే ఒక ఎద్దు వెంబడి అనేక ఆవులూ, దూడలూ పెద్ద మందగా వచ్చి పశువుల దొడ్డిలో ప్రవేశించి, రోజూ అలవాటైన వాటిలాగా తలా ఒక చోటా పడుకున్నాయి.

ఇక నుంచీ బెస్తవాడి జీవితం పూర్తిగా మారిపోయింది. వాడిప్పుడు పేదవాడు కాకపోగా మహా ధనికుడు. ఆ చుట్టుపట్ల వాణ్ణి మించిన ధనికుడు లేడు. వాడు పొలాలు కొనుక్కున్నాడు. పెళ్ళి చేసుకుని ఒక ఇంటివాడయాడు. ఆ ప్రాంతాల ఉండే ఘరానా మనుషులతో బాటు జమ అయాడు. ఎవరన్నా సలహా అడగటానికి వస్తే గడ్డం నిమురుకుంటూ, "నా కిదే పని అనుకున్నావా? రేపు కనిపించు, చూస్తాం! వట్టి చేతులతో వచ్చేవు!" అని దర్పంగా

మాట్లాడటం నేర్చాడు. ఈ విధంగా ఆరు మాసాలు గడిచాయి. ఒక రోజు బెస్త వాడు పొరుగూళ్లో విందు జరిగితే అక్కడికి వెళ్ళాడు. అక్కడ బాగా తిని, మితిమించి సారాయి తాగాడు. విందు ముగిసే సరికి పొద్దు పోయింది. బెస్తవాడు తూలుతూ, అవకాశం దొరికితే ఎవరి మీదనైనా విరుచుకు పడటానికి సిద్ధంగా ఇంటికి వచ్చాడు. ఇంట్లో అందరూ తలుపులు వేసుకుని గాఢనిద్రలో మునిగి ఉన్నారు.

"తలుపు! తలుపు! కామందు వచ్చాడు, తలుపు తెరవండి!" అని వాడు కేకలు పెట్టాడు. కాని ఎవరూ పలకలేదు. వాడికి ఆగ్రహం తన్నుకొచ్చింది. "ఏమిటీ? నేనంటే అంత అలుసై పోయిందా? సరస్సులో నుంచి నేను పైకి తీసిన ఆ ముసలి తొత్తు ఏం చేస్తున్నదీ? లేచి తలుపు తియ్యవే, ముసలి పీనుగా!" అని అరిచాడు. వాడి మాట వాడి నోట ఉండగానే తలుపు తెరిచి ముసలిది వాకిట నిలబడింది. ఆమె వాడి కేసి చూస్తూ, "నువు నన్ను నిష్కారణంగా తిట్టావు. చేసిన మేలు మరిచే వాళ్ళ దగ్గిరా, మసలుకోవటం తెలియని వాళ్ళ దగ్గిరా నేనుండను. రేపే నా చోటికి నేను వెళ్ళిపోతున్నాను," అన్నది.

"ఓ యబ్బో! పోతే పో! పీడ విరగడ అవుతుంది," అన్నాడు బెస్తవాడు.

మర్నాడు ఉదయం ముసలిది నిద్ర లేచింది. పక్క బట్టలు చక్కగా మడిచి పెట్టింది. అంట్లు గిన్నెలు శుభ్రంగా తోమింది. ఇల్లు ఊడ్చింది. ఇంటి నుంచి ఒక్క పూచిక పుల్ల కూడా తీసుకోకుండా వెళ్ళి, పశువుల దొడ్డి వాకిలి తెరిచింది. తరవాత ఆమె సరస్సు కేసి నడిచింది. పశువులన్నీ జంటలు జంటలుగా ఆమె వెనక బయలుదేరి వెళ్ళి, ఆమెతోబాటు సరస్సులో ప్రవేశించి కనిపించకుండా పోయాయి. బెస్తవాడు మళ్ళీ చేపలు పట్టి జీవించే స్థితికి వచ్చేశాడు. వాడి అదృష్ట దేవత వెళ్ళిపోయింది.



# ప్రతిభ

ఉత్తరదేశ యాత్రకు బయలుదేరిన జ్ఞానానందుడూ, దక్షిణదేశ యాత్రకు బయలుదేరిన విజయానందుడూ అనే సాధువులు, ఒక చోట కలుసుకున్నారు. ప్రయాణంలో తమ, తమ అనుభవాల గురించి కొంతసేపు ముచ్చటించుకున్న తరవాత, మాటల సందర్భంలో, జ్ఞానానందుడు, "ప్రతివారిలోనూ, ఏదో ఒక ప్రతిభ వుంటుంది!" అన్నాడు.

"ప్రతివాడిలోనూ ఏదో ఒక ప్రతిభ వుండడం అసంభవం!" అన్నాడు విజయానందుడు.

కాసేపు ఇరువురి మధ్యా వాదోపవాదాలు జరిగినై.

చివరకు విజయానందుడు, "మీలో ఏం ప్రతిభ వుంది? ముందు ఆ సంగతి చెప్పండి," అన్నాడు.

"ఎదుటివారిలోని ప్రతిభను గ్రహించగలిగే ప్రతిభ, నాలో వున్నది," అన్నాడు జ్ఞానానందుడు.

"అయితే, నాలో ఏం ప్రతిభ వుందో చెప్పండి," అని రెట్టించాడు, విజయానందుడు.

"మీకు, ఎదుటివారి ప్రతిభను గ్రహించకపోవడంలో ప్రతిభ వున్నది!" అన్నాడు జ్ఞానానందుడు.

ఆ జవాబుకు విజయానందుడు సిగ్గుతో తల వంచుకున్నాడు. —"చైతన్య"





# శివలీలలు

మృకండు మహర్షి భృగు సంతతివాడు. అతని భార్య మరుద్వతి. వారికి ఎన్నాళ్లకూ సంతానం కలగకపోగా, నిష్ఠానియమాలతో తపస్సులు చేస్తూ క్షేత్రాలు సేవించు కుంటూ కేదారక్షేత్రానికి వచ్చారు.

ఒకనాడు కేదారేశ్వరుణ్ణి అర్చించి ధ్యానమగ్నులై ఉండగా, ''ఇహ మీరు మీ ఆశ్రమానికి వెళ్ళండి. మీకు పుత్రభాగ్యం కలుగుతుంది!'' అని వారికి వినిపించింది. సంతోషంతో వారు ఇంటికి వచ్చి యథా విధిగా గృహస్థాశ్రమ ధర్మాల్ని నిర్వర్తించు తూండగా, కొన్నాళ్ళకు మరుద్వతి మగ శిశువును ప్రసవించింది. అదే సమయంలో ఆకాశం నుండి వారికి, ''ఈ పిల్లవాడు అల్పాయుష్షుడు—పన్నెండేళ్ల ఆయువు!'' అని ఒక దివ్యవాణి వినిపించింది. అది విని వారు ఆనంద శిఖరాగ్రం నుండి ఒక్కసారిగా దుఃఖసాగరపు లోతుల్లోకి కూలిపోయారు. చివరకు, ''అంతా ఆ శివుని లీల, మనం ఏం చేయగలం?'' అని తెప్పరిల్లి పసివాడి బోసి నవ్వుల్లో మైమరిచారు.

తరవాత మృకండుడు కుమారుడికి జాతకర్మ జరిపించి, మార్కండేయుడు అని నామకరణం చేశాడు. దినదిన ప్రవర్ధమానుడై మార్కండేయుడు ఉప నయనం అయ్యాక గురుకులానికి వెళ్ళి, గురువులవద్ద విద్యాబుద్ధులన్నీ నేర్చి, పదకొండేళ్ళవాడై తలిదండ్రుల వద్దకు వచ్చాడు. బ్రహ్మతేజంతో ముద్దులు మూట

1. మార్కండేయుడి కథ



గట్టుతున్న కుమారుణ్ణి చూడగానే వారి గుండెలు తరుక్కుపోయినవి. ఇంకొక్క సంవత్సరమే గడువు! మరుద్వతి కుమారుణ్ణి వదలకుండా కౌగలించుకొని కన్నీరు కార్చుతుండేగాని, మార్కండేయుడు ఎంత తరిచి తరిచి అడిగినా అసలు సంగతి చెప్పదు. చివరకు మృకండుడే చెప్పలేక చెప్పలేక కొడుకుతో, అతనికి ఒక యేడాదిలో మృత్యువు ఆసన్నం అవుతూన్నదని విషయమంతా చెప్పాడు.

అది విని మార్కండేయుడు ధీర చిత్తంతో ఆలోచించి, "మీరు నన్ను ఆశీర్వదించండి. ఇప్పుడే నేను తపస్సుకు వెళుతున్నాను. శివానుగ్రహంతో మృత్యువును జయించి చిరంజీవినై వస్తాను," అని తలిదండ్రులకు ప్రణమిల్లాడు.

మరుద్వతీ మృకండు లిద్దరూ కుమారుణ్ణి కౌగలించుకొని 'చిరంజీవ' అని దీవించారు. అదే సమయానికి అక్కడికి నారదమహర్షి వచ్చాడు. మృకండుడు నారదుణ్ణి పూజించి తమ కుమారుడి గురించి అంతా చెప్పాడు. నారదుడు మార్కండేయుడి దృఢసంకల్పాన్ని మెచ్చుకుని, "నాయనా! మార్కండేయా! నువ్వు తిన్నగా గౌతమీతీరానికి వెళ్ళు. అక్కడ పంచాక్షరీ మంత్రంతో శివుణ్ణి దీక్షతో అర్చించు. నీకు జయమౌతుంది!" అని దీవించి వెళ్ళాడు.

మార్కండేయుడు గౌతమీతీరాన్ని చేరుకొని సైకతలింగాన్ని ప్రతిష్ఠించి, "చంద్రశేఖరా! నీవే నన్ను రక్షించు! నీ పాదాలను ఆశ్రయించిన నన్ను యముడు ఏం చేయగలడు?" అంటూ దీక్షతో తపస్సు సాగించాడు.

లోకాలన్నీ తిరుగుతూ నారదుడు యముడి దగ్గిరికి పోయి, "మృత్యువును తప్పించుకోడానికి మార్కండేయు డనే ముని బాలకుడు తపస్సు చేస్తున్నాడు. ఇహ నీ బలాబలా లెలాంటివో తేలే సమయం వచ్చింది!" అంటూ చల్లగా చెప్పిపోయాడు.



ప్రళయరుద్రుడై తెరుచుకొన్న త్రినేత్రంతో ఆవిర్భవించి, యముడిపై త్రిశూలాన్ని గురి పెట్టేసరికే యముడు భయంతో గజ గజ లాడిపోతూ చేతులెత్తి జోడిస్తూ, "హరహరా! రక్షించు!" అంటూ కూలి పోయాడు.

శివుడు మార్కండేయుడి తలపై తన అభయ హస్తాన్ని ఉంచి, "వత్సా! నీకు మృత్యువు లేదు. కల్ప కల్పాంతరాలు చూస్తూ చిరంజీవిగా ఉంటావు!" అని వరమిచ్చాడు. తరువాత దేవతలంతా వచ్చి, యముడు లేకపోతే చాలా యిబ్బం దులు వచ్చి పడతాయి గనక యముణ్ణి మన్నించమని శివుణ్ణి కోరారు. శివుడి అనుగ్రహంతో యముడు మళ్లీ పునర్జన్మ ఎత్తినట్లుగా లేచి తన లోకానికి వెళ్ళాడు.

ఆ సమయానికే కుమారుణ్ణి వెతు క్కుంటూ వచ్చిన మరుద్వతీ మృకండులు, శివానుగ్రహం పొందిన మార్కండేయుణ్ణి చూసి, శివలీలలను కొనియాడుతూ చిరం జీవితో తమ నివాసానికి వెళ్ళారు.

మార్కండేయుడు బహుకాలం జీవిం చినవాడు. కాని అతనికన్న ఎక్కువ కాలం జీవించిన వాళ్ళున్నారు.

ఇంద్రద్యుమ్నుడు అనే రాజు బతికి ఉండగా గొప్ప యశస్సు సంపాదించి, అది నిలిచినంత కాలమూ స్వర్గసుఖాలు

మార్కండేయుడి ఆయువు పూర్తి కావస్తున్నది. యముడు మార్కండేయుడి ప్రాణాలు తోడితెమ్మని తన దూతలను పంపాడు. యమకింకరులు మార్కండే యుణ్ణి సమీపించలేక తిరిగి వచ్చారు. అప్పుడు యముడే దండాన్నీ, పాశాన్నీ ధరించి ఎనుబోతు నెక్కి బయలుదేరాడు.

మార్కండేయుడు శివలింగానికి తలను ఆనించి రెండు చేతులతోనూ శివ లింగాన్ని గట్టిగా బిగించి పట్టుకొని ధ్యాన మగ్నుడై ఉన్న సమయంలో, యముడు కాలపాశాన్ని మార్కండేయుడి కంఠానికి విసిరాడు. ఆ పాశం శివలింగం మీదుగా పడీపడ్డంతో శివలింగం నుండి శివుడు

అనుభవించాడు. తరవాత స్వర్గంలో వాళ్ళు, "భూలోకంలో నిన్ను తలుచుకునే వాళ్ళెవరూ లేరు. అందుచేత నీకు స్వర్గంలో స్థానం లేదు. భూమికి తిరిగి వెళ్ళు," అన్నారు.

ఇంద్రద్యుమ్నుడు భూలోకానికి తిరిగి వచ్చి, తన పేరు విన్నవారి కోసం వెతుకుతూ మార్కండేయుడి వద్దకు వచ్చాడు.

"నేను నిన్ను ఎరగను. కాని నాకంటె పెద్దవాడు ప్రావారకర్ణుడు అనేవాడు (గుడ్లగూబ) ఉన్నాడు. వాణ్ణి అడుగు," అన్నాడు, మార్కండేయుడు. ఇద్దరూ కలిసి ప్రావారకర్ణుడి వద్దకు వెళ్ళారు.



"నేను నిన్ను ఎరగను. కాని నాకన్న పెద్దవాడు నాళీకజంఘు డున్నాడు అతన్ని అడుగుదాం," అన్నాడు ప్రావారకర్ణుడు.

నాళీకజంఘుడు కూడా ఇంద్రద్యుమ్నుణ్ణి ఎరగడు. అతను వారిని వెంటబెట్టుకుని, తనకన్న వయసు గల అకూపారుడు అనే తాబేలు వద్దకు వెళ్ళాడు.

అకూపారుడు ఇంద్రద్యుమ్నుణ్ణి చూసి, "నేను నిన్ను ఎరుగుదును. నేనుంటున్న ఈ కొలను ఎలా వచ్చింది? నువు అనేక యజ్ఞాలు చేసి గోవులను దాన మియ్యాగా, ఆ గోవులు తొక్కటం చేత ఏర్పడింది," అన్నాడు.

అప్పుడు దేవదూతలు, ఇంద్రద్యుమ్నుడి కీర్తి ఇంకా భూలోకంలో మిగిలి ఉన్నదని చెప్పి, అతన్ని స్వర్గానికి తీసుకుపోయారు.

భీమావతి అనే ఊళ్ళో శివభక్తుడైన సోమయాజి ఒకడు ఉండేవాడు. ఆయనకు సిద్ధరాముడు అని ఒక కొడుకు కలిగాడు. ఆ కుర్రవాడి ఏడవ ఏట సోమయాజి మరణించాడు. తండ్రి లేని ఆ ఏక పుత్రుణ్ణి తల్లి ఎంతో శ్రద్ధగా పెంచుతూ వచ్చింది.

దీపావళి ఇంకా కొన్ని రోజులుందనగా ఒకనాడు రాముడు, తన ఈడు కుర్రవాళ్ళతోబాటు, సమిధలూ, ఆకులూ

తీసుకురావటానికి వనానికి వెళ్ళాడు. అక్కడ పిల్లలందరూ ఒక మర్రిచెట్టు కింద కూర్చుని కబుర్లు చెప్పుకోసాగారు.

"వచ్చే దీపావళికి మా అక్కనూ, బావనూ తెస్తాం. పండగకు మా ఇంట్లో అప్పాలు చేసుకుంటాం. మా అక్కకూ, బావకూ చక్కటి బట్టలు పెడతాం," ఈ విధంగా కుర్రవాళ్ళందరూ చెప్పుకుంటున్నారు.

ఆ మాటలు విని రాముడు, "నేను కూడా పండగకు మా అక్కనూ, బావనూ తెస్తాను. మా ఇంట్లో పాయసం వండుకుంటాం. మా అక్కకూ, బావకూ సన్నని బట్టలు పెడతాం," అన్నాడు.

ఈ మాటలకు పిల్లలందరూ వెటకారంగా నవ్వి, "నీకు మొదలు అక్కే లేదుగదా, బావ ఎలా ఉంటాడురా? మా దగ్గిరే దంభాలు పలుకుతున్నావా? చెప్పు, నీ అక్క ఎవరు? పేరేమిటి? మీ బావ పేరేమిటి? ఆయన ఎక్కడ ఉంటాడు? ఏం చేస్తాడు? ఏం చదువుకున్నాడు? వాళ్ళ కెంతమంది పిల్లలు?" అని సిద్ధ రాముడి మీద ప్రశ్నల వర్షం కురిపించారు.

వాళ్ళ ప్రశ్నలకు సమాధానం చెప్పలేక, అవమానంతో ఏడుస్తూ రాముడు ఇంటికి తిరిగి వచ్చాడు.

కొడుకు ఏడుస్తూ రావటం చూసి తల్లి వాణ్ణి దగ్గిరికి తీసి, కన్నీరు తుడుస్తూ, "ఏం, నాయనా? పడ్డావా? దెబ్బ తగిలిందా? ఎవరన్నా కొట్టారా? ఏం జరిగింది?" అని అడిగింది.

రాముడు తల్లికి తన తోటిపిల్లలు చేసిన ఎగతాళి గురించి చెప్పాడు.

అంతా విని తల్లి, "వాళ్ళ మాటల కేంరా? మీ అక్క పేరు భ్రమరాంబ. మీ బావ మల్లన్న. వాళ్ళు శ్రీశైలపర్వతం మీద ఉంటారు. వాళ్ళు అష్ట ఐశ్వర్యాలు గలవాళ్ళు. గణపతి, కుమారస్వామి అని వారికి కొడుకు లున్నారు. లోకాలన్నీ మీ బావ చెప్పినట్టు నడుచుకుంటాయి. నీ బావ లాటి బావ ప్రపంచంలో ఎవరికీ లేడురా!" అన్నది.





# ఎక్కువ తక్కువలు

లోకంలో ఎవరు ఎక్కువ? అని ఒకప్పుడు వేదాంతికీ, రైతుకూ మధ్య వాదం పడింది.

"ఎన్నాళ్ళు చూసినా కలుపు తీయటం, దుక్కి దున్నటం, నూర్చటం—ఇదే పనిగా వున్నదే నీకు. భూమిలో కలుపే కాదు, నీ మనసులోని కలుపు కూడా తీసి వేయాలి బిడ్డా! లేకుంటే ఆ చెట్టుకూ, నీకూ తేడా ఏముంది?" అన్నాడు వేదాంతి.

అందుకు రైతు, "అయ్యా, వేదాంతి గారూ, మీకంటె సంఘానికి నేనే ఎక్కువ ఉపకారిననే సంగతి మీకు తెలియదు కాబోలు. మీరు బోధించే వేదాంతం లేక పోయినా లోకం జీవించగలదు. నేను పండించే ధాన్యాలు లేకుంటే మీరు నిమిషం కూడా నిలువలేరు సుమండీ!" అన్నాడు.

వేదాంతి ఆలోచనలో పడ్డాడు. అప్పుడు రైతు "ఆలోచన ఎందుకు? ఒక చిన్న కథ చెబుతా వినండి: ఇలాగే ఒకప్పుడు ఒక రాయికీ, మట్టి బురదకీ వివాదం వచ్చింది. 'నేను చూడు. ఎంత బలంగా, శుభ్రంగా, ముచ్చటగా వున్నానో', అని గర్వంతో అన్నది రాయి. అలా అని ఊరుకోక, 'ఛీ!, నువ్వేమిటి, ముట్టుకుంటే పిసపిస లాడిపోతావు. నిన్ను తొక్కితే మానవులు అసహ్యించుకుంటారు. కాళ్ళు కడుక్కునే దాకా వాళ్ళకు తోచనే తోచదు' అంటూ హేళన కూడా చేసింది.

గర్వి అయిన రాయి ఇలా అనగానే మట్టిబురదకు పౌరుషం వచ్చింది: 'ఓ పాషాణమా! చూడటానికి నేను అసహ్యంగానే ఉండవచ్చు. ఐతే, మానవుడి ప్రాణాలను నిలబెట్టే పంటలకు జీవం

పోసేది ఎవరో తెలుసా? నేనే' అని తెగేసి జవాబు చెప్పింది,'' అన్నాడు రైతు.

రైతు చెప్పిన ఈ కథకు వేదాంతి, ''ఓయి పెద్దమనిషీ! మట్టిబురద చెప్పిన జవాబు కాదనలేము. కాని, రెండో పక్షం కూడా ఆలోచించాలి. బురద సాయంతో పంటలు పండుతూ వుంటే—గొప్ప గొప్ప భవనాలు, గుడులూ, గోపురాలూ నిర్మించ డానికి శిలలు వినియోగమవుతున్నాయి. కనుక, దేని ఉపయోగం దానిది. రెండూ లోకానికి అవసరమే!'' అని వాదించాడు.

ఆ మీదట, ''సరే. దారికి వస్తున్నారు మీరు. ప్రతి మనిషి ఉపయోగమూ, ప్రతి వస్తువు ఉపయోగమూ ప్రపంచానికి ఉన్న దని ఒప్పుకొంటున్నారుకదా. విన్నారో లేదో, మరొక చిన్న కథ చెప్పనివ్వండి. విని తరువాత మీ అభిప్రాయం చెబుదురు గాని,'' అంటూ, ఇలా చెప్పాడు రైతు:

''ఒక అడవిలో ఒక మర్రిచెట్టూ, ఒక టేకుచెట్టూ ఉండేవి. ఒకప్పుడు మర్రి చెట్టు టేకుచెట్టుతో 'నేను లక్షలాది జీవు లకు నీడనిస్తాను. చేటలంతేసి ఆకులున్న వన్న మాటేగాని, నీవల్ల కొంచెమైనా మానవునికి ఉపకారం లేదుకదా!' అని దెప్పిపొడిచింది.

అందుకు టేకుచెట్టు 'గర్వించిన ఓ మర్రీ! నీ అహంభావం కట్టిపెట్టు. నీవు ఏపాటి? నీవు ఇచ్చే నీడ ఏపాటి? నా కలపతో మానవులు శాశ్వతమైన ఇళ్ళు కట్టుకుని తరతరాలా హాయిగా కాలక్షేపం చేస్తారు', అంటూ తల వంచుకునేటట్టు మర్రికి జవాబిచ్చింది.''

రైతు ఈ కథ చెప్పగానే, వేదాంతి వాడిని ఆదరించి చేరదీసుకున్నాడు. ''అబ్బాయీ! ఐతే యిప్పుడు నువు శరీ రానికి నీడనిచ్చే మర్రిచెట్టువి; నేను మన సుకు శాంతి నిచ్చే టేకుచెట్టును. పంటకు జీవాన్నిచ్చే మట్టివి నువు; మనసుకి రక్షణనిచ్చే శిలను నేను. తెలిసిందా? ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనేది లేదు. లోకానికి మనిద్దరమూ అవసరమే'' అని చక్కగా ప్రబోధం చేశాడు.






రత్నగుప్తుడనే ఒక ధనికవర్తకుడి ఇంట్లో దొంగతనం జరిగింది. పదివేల వరహాలు, రాత్రికి రాత్రి మాయమైపోయాయి. డబ్బున్న గదికి పక్కనే వున్న నడవలో, నలుగురు పనివాళ్ళు పడుకున్నారు. సహజంగా రత్నగుప్తుడి అనుమానం, వాళ్ల మీదికే వెళ్ళింది.

రత్నగుప్తుడు చాలా సాధు స్వభావం కలవాడు. కఠినంగా ఎవరినీ మందలించ లేడు. ఆయనకు వ్యాపారవ్యవహారాల్లో, చేదోడువాదోడుగా వుండే సోమశాస్త్రి చాలా తెలివైనవాడు. రత్నగుప్తుడు జరిగినది సోమశాస్త్రికి చెప్పి, "ఆ పనివాళ్ళ మనసులు నొప్పించకుండా, వాళ్ళల్లో దొంగ ఎవరో పట్టుకోవాలి," అని కోరాడు.

సోమశాస్త్రి సరేనని, పనివాళ్ళు నలుగురినీ, ఒక గదిలోకి పిలిచి, "మీరు డబ్బున్న గదికి పక్కనే పడుకున్నారు. ఆ గదిలో దొంగతనం జరిగింది. రత్నగుప్తుడు మంచివాడు గనక, మిమ్మల్ని రాజభటులకు అప్పగించలేదు. సరే, జరిగిందేదో జరిగిపోయింది. సాయంత్రానికల్లా, పోయిన డబ్బు తిరిగి అక్కడికి చేరాలి. అలా జరక్కపోయిందో, మీరు ఇంతంతనరాని ప్రమాదానికి గురవుతారు. జాగ్రత్త!" అన్నాడు.

పనివాళ్ళు భూషయ్య, ధర్మయ్య, సోమయ్య, రామయ్య—తలలు వంచుకుని, సోమశాస్త్రి చెప్పింది విన్నారు. ఆ రోజంతా సోమశాస్త్రి, వాళ్ళను రహస్యంగా ఒక కంట కనిపెట్టే వున్నాడు. కాని, వాళ్ళు మామూలు ప్రకారం తమ పనులు చేసుకుని వెళ్లిపోయారు. రాత్రికి కూడా డబ్బు యథాస్థానాన్ని చేరలేదు.

మర్నాడు సోమశాస్త్రి, ఆ నలుగురినీ విడివిడిగా ఒక గదిలోకి రమ్మన్నాడు.

"వసుంధర"



ముందుగా ధర్మయ్య వచ్చాడు. సోమశాస్త్రి వాడితో, "నువ్వు దొంగతనం చేశావనడానికి, నాకు ఈ రోజు ఉదయమే కొన్ని రుజువులు దొరికాయి. మర్యాదగా నేరం ఒప్పుకుని, డబ్బు తెచ్చిస్తే, నిన్ను క్షమించగలను," అన్నాడు.

ధర్మయ్య వెంటనే ఏదో దెబ్బతిన్న వాడిలా అయిపోయి, కాసేపాగి, "ఈ ఇంట పదేళ్ళుగా పని చేస్తున్నాను. ఎన్నడూ యిలాంటి మాట పడలేదు. బాబు గారి ఉప్పుతిని, వారికే ద్రోహం చేశానన్న మాటపడ్డాక, నేను బతికి కూడా ప్రయోజనం లేదు. వెధవప్రాణాలు—పోయినా బావుండును!" అంటూ బాధపడ్డాడు.

సోమశాస్త్రి, ధర్మయ్యను పంపేసి, భూషయ్యను పిలిపించాడు. వాడికీ అవే మాటలు చెప్పగానే, వాడు గజగజ వణికి పోతూ, "బాబూ, మీరే నన్ను రక్షించాలి! నిజంగా నాకేమీ తెలియదు," అంటూ సోమశాస్త్రి కాళ్ళు పట్టుకున్నాడు.

"తప్పు చేయకపోతే, భయపడడమెందుకు? నా దగ్గిరున్న రుజువులేమిటో రేపు చెబుతాను," అని, సోమశాస్త్రి వాణ్ణి పంపేసి, రామయ్యను పిలిచాడు.

వాడు సోమశాస్త్రి తనను దొంగ అనగానే, "అయ్యా, మాటలు జాగ్రత్తగా రానీండి! మీరు వున్నవాళ్ళు, మేం లేని వాళ్ళం కావచ్చు. అందుకని, మీరు నోటికొచ్చిన మాటల్లా అంటే, నేను సహించేది లేదు," అన్నాడు కోపంగా.

"ఇలాంటి బెదిరింపులకు, నేను భయపడేవాణ్ణి కాదు. మీరున్న పక్క గదిలోనే దొంగతనం జరిగినప్పుడు, అందులో మీకూ భాగం వున్నట్టే. మిమ్మల్ని ఆ నడవలో ఎందుకు పడుకోమన్నట్టు? దొంగతనాలేవీ జరక్కూడదనేకదా! మీ బాధ్యత మరిచారు. వెళ్ళు, నా దగ్గిరున్న రుజువులేమిటో రేపు చెబుతాను," అని, వాణ్ణి పంపేశాడు సోమశాస్త్రి.

ఆఖరున వచ్చిన సోమయ్య కూడా, రామయ్యలాగే సోమశాస్త్రి మీద తిరగ

పడ్డాడు. అప్పుడు సోమశాస్త్రి, "ఇంట్లో దొంగలుపడి దోచుకుపోతూంటే, ఒళ్ళెరక్కుండా నిద్ర పోయానంటావు! అది మాత్రం తప్పు కాదా?" అని అడిగాడు.

సోమయ్య కోపంగా, "మేము ఇంట్లో పనులు చేయడానికే తప్ప, కాపలా కాయడానిక్కాదు. రోజంతా కష్టపడి పని చేసినవాళ్ళకు, ఒళ్ళెరక్కుండా నిద్ర పట్టడంలో ఆశ్చర్యం లేదు. కావాలంటే మమ్మల్ని కాపాలావాళ్ళుగా నియమించండి! అప్పుడు మేము పగలంతా నిద్ర పోయి, రాత్రిళ్ళు కాపలా కాస్తాం. అప్పుడు ఇంట్లో ఏమైనా దొంగతనం జరిగితే, మమ్మల్ని తప్పుపట్టండి," అన్నాడు.



సోమశాస్త్రి వాణ్ణి కూడా పంపివేసి, రత్నగుప్తుడి వద్దకు వెళ్ళి, "మొత్తం మీద, ఈ దొంగతనం నలుగురూ కలిసి చేసింది కాదు. ఇందులో ధర్మయ్య, రామయ్య పూర్తిగా నిర్దోషులు. నా అనుమానం భూషయ్య మీద వున్నది. వాడూ, సోమయ్యా కలిసి, ఈ దొంగతనం చేసి వుండవచ్చు. ముందు, వాళ్ళుంటున్న గదులు రెండూ, పూర్తిగా వెతికించాలి," అని చెప్పాడు.

రత్నగుప్తుడు తన ఇంటి వెనక ఆవరణలో, ఆ నలుగురు పనివాళ్ళకోసం, నాలుగు పెద్ద గదులు కట్టించాడు. వాళ్ళ కుటుంబాలు అందులోనే వుంటాయి. నలుగురూ రాత్రివేళల్లో మాత్రం, రత్నగుప్తుడి ఇంటి నడవలో పడుకోవాలి.

ఎంత వెతికించినా, భూషయ్య, సోమయ్య నివాసాల్లో ఏమీ దొరకలేదు. అప్పుడు సోమశాస్త్రి, రత్నగుప్తుడితో, "అయితే, సోమయ్య కూడా నిర్దోషి; భూషయ్యే దోషి. వాడు తనే దొంగతనం చేసి వుండాలి; లేదా దొంగ ఎవడో వాడికి తెలిసి వుండాలి," అన్నాడు.

"ఆ సంగతి వాడి చేత ఒప్పించడం ఎలా?" అన్నాడు రత్నగుప్తుడు.

"నీడలా వాడిని కనిపెట్టి వుండడమే మార్గం!" అన్నాడు సోమశాస్త్రి.



రత్నగుప్తుడు అలాంటి ఏర్పాటు చేశాడు. ఇది జరిగిన పది రోజులకు, భూషయ్య సంతలో, పట్టుచీరలు బేరం చేస్తూ, సోమశాస్త్రికి దొరికిపోయాడు. వాడి దుస్తుల్లో నూరువరహాలు దొరికాయి.

"ఇంత డబ్బు నీకెక్కడిదో చెప్పు ?" అని సోమశాస్త్రి, వాణ్ణి నిలదీశాడు.

భూషయ్య భయంతో మాటపెగలక వణికిపోసాగాడు. సోమశాస్త్రి, వాణ్ణి రత్నగుప్తుడి వద్దకు తీసుకుపోయాడు.

సోమశాస్త్రి చెప్పినట్టే, భూషయ్య దొంగ అయినందుకు రత్నగుప్తుడు ఆశ్చర్యపోయి, వాణ్ణి మిగతా డబ్బు తీసుకు రమ్మన్నాడు.

భూషయ్య, "అయ్యా, ఈ దొంగతనం నేను చెయ్యలేదు," అన్నాడు.

"అయితే, ఎవరు చేశారు ?" అన్నాడు రత్నగుప్తుడు గద్దిస్తూ.

"చెబితే ధనగుప్తుడుగారు, నన్ను చంపేస్తారు !" అన్నాడు భూషయ్య.

ధనగుప్తుడి పేరు వింటూనే, రత్నగుప్తుడు ఉలిక్కిపడ్డాడు. వాడు రత్నగుప్తుడి భార్యకు తమ్ముడు. ఏ పనీ చేయక అల్లరిచిల్లర వెధవలతో తిరుగుతున్నాడని, మామ అతణ్ణి రత్నగుప్తుడివద్దకు పంపాడు.

"అసలేం జరిగిందో భయపడకుండా చెప్పు," అన్నాడు రత్నగుప్తుడు.

అప్పుడు భూషయ్య, "అయ్యా, మేం నలుగురం పడుకునేచోట వున్న గదిలో, తమరు డబ్బూ, ఇతర విలువైన వస్తువులూ వుంచుతారని, మాకు తెలుసు. అందువల్ల, మేం వంతులవారీగా ఒక్కొక్కళ్ళం మెలుకువగా వుండి, తతిమ్మావాళ్ళం నిద్రపోతాం. ఆ రోజు రాత్రి, నేను మేలుకుని వున్న సమయంలో, ధనగుప్తుడుగారు పిల్లిలా అడుగులు వేసుకుంటూ అక్కడికి వచ్చారు. ఆయన చేతిలో కత్తి వున్నది. ఎవరితో అయినా చెబితే, పొడిచి చంపుతానని నన్ను బెదిరించి, మారుతాళం చెవితో డబ్బున్న గదిలోకి పోయి, డబ్బు దొంగి

లించి, అందులోంచి లంచంగా నాకు రెండువందల వరహాలు ఇచ్చారు. ఆ డబ్బును నేను, ధనగుప్తుడుగారుండే గది లోనే దాచుకున్నాను,'' అని చెప్పాడు.

ఇది వింటూనే రత్నగుప్తుడు ధనగుప్తుడి గదిలో వెతకగా, అక్కడ ఎనిమిదివేల వరహాలు దొరికాయి. ధనగుప్తుడు మారు మాట్లాడకుండా, తన నేరం ఒప్పుకున్నాడు. రత్నగుప్తుడి భార్య తమ్ముణ్ణి గట్టి చీవాట్లు వేసి, తండ్రి ఇంటికి పంపివేసింది.

ఆ తర్వాత రత్నగుప్తుడు, సోమశాస్త్రిని తన గదికి పిలిచి, ''నీ మూలంగా అసలు విషయం సులభంగా తెలిసిపోయింది. మిగతా ముగ్గురూ అమాయకులనీ, భూషయ్యకే దొంగతనం గురించి తెలిసి వుంటుందనీ, నువ్వెలా అనుమానించావు ?'' అని అడిగాడు.

సోమశాస్త్రి చిన్నగా నవ్వి, ''ఇది చాలా సులభం. ఏ మనిషికైనా చెయ్యని నేరం అంటకడితే బాధపడతాడు. ధర్మయ్య బాధపడ్డాడు. కాబట్టి అతడు నేరం చెయ్య లేదనుకున్నాను. అయితే, ధర్మయ్య యీ ఇంటి ఉప్పుతిన్నాననుకుంటున్నాడు. వాడికి ఆత్మాభిమానం లేదు. ఆత్మాభి మానం వున్నవాడు, చెయ్యని నేరం చేశా వంటే, తిరగబడతాడు. రామయ్య అలా తిరగబడ్డాడు. అయితే, వాడి బాధ్యతను సరిగా నిర్వహించలేదనగానే, ఊరుకున్నాడు. సోమయ్య తిరగబడడమే కాక, ఇంటి కాపలా తన బాధ్యత కాదు పొమ్మన్నాడు. అంటే, వాడు తిరగబడడానికి కారణం, కోపం కాదన్న మాట! వాడికి దబాయించే అలవాటున్నది. అలాంటి వాడు కూడా దొంగ కావచ్చు! కానీ, అసలైన దొంగ తన మీదికి అనుమానం రాగానే భయపడతాడు. భూషయ్య అలా భయపడ్డాడు. దొంగతనం చేసినా, చేయకపోయినా, వాడికి దొంగతనం ఎలా జరిగిందో తెలుసునని అర్థమైంది, నాకు,'' అన్నాడు.

రత్నగుప్తుడు, సోమశాస్త్రిని ఎంతగానో మెచ్చుకున్నాడు.



# ఈతనేర్చిన వైద్యుడు

వృషభేంద్రయ్యా అనే వైద్యుడు, ఒక రాత్రివేళ పొరుగు గ్రామంలో, ఒక రోగికి చికిత్స చేసేందుకు వెళ్ళాడు. ఆయన అనాలోచితంగా ఇచ్చిన మందు కారణంగా, రోగి మరణించాడు. రోగి బంధువులు రెచ్చిపోయి, వృషభేంద్రయ్యను పెరట్లో ఒక చెట్టుకు కట్టివేసి, "నీకు ఎలాంటి శిక్ష విధించాలో ఉదయం నిర్ణయిస్తాం!" అని వెళ్ళిపోయారు.

ఆ రాత్రి వృషభేంద్రయ్య ఎలాగో కట్లు విప్పుకుని, దారిలో వున్న ఒక నది ఈది, సూర్యోదయానికల్లా ఇల్లు చేరాడు. ఆ సమయంలో ఆయన కొడుకు వైద్యగ్రంథాలు చదువుతున్నాడు.

వృషభేంద్రయ్యా వాణ్ణి సమీపించి, "ఒరే, బాబూ! ఆ వైద్యగ్రంథాల్లో అలా మునిగి తేలకు. నాలా వైద్యుడు కాదలచినవాడు, ముందుగా ఈతనేర్చుకోవడం ముఖ్యం!" అని సలహా యిచ్చాడు.

—దామరాజు సుబ్బారావు





# బాకీ వసూలు

దేవరపల్లి గ్రామంలో వీరదాసు చాలా ధనికుడు. ఆయన వడ్డీవ్యాపారం చేస్తూండే వాడు. అవసరం అయినవాళ్ళకు డబ్బు అప్పుగా యిచ్చి, వాళ్ళ నుంచి న్యాయమైన వడ్డీ మాత్రమే తీసుకునేవాడు. గ్రామంలోని చాలామంది ప్రజలు అవసరపడినప్పుడు, ఆయన దగ్గిర డబ్బు తీసుకుని, ఆ మొత్తాన్ని అంచెలంచెలుగా చెల్లిస్తూండేవాళ్ళు.

దేవరపల్లికి పొరుగున వున్న గ్రామంలో కామయ్య అనే షావుకారు ఉండేవాడు. ఆయనకు తాత తండ్రులు సంపాయించి వదిలిపోయిన బోలెడంత ఆస్తి వున్నా, మరింత గడించాలన్న ఆశతో, అవసరంలో వున్నవాళ్ళ నుంచి అధిక వడ్డీలు వసూలు చేయాలని ప్రయత్నించేవాడు. కాని, అప్పు తీసుకున్నవాళ్ళు, ఒక పట్టాన అసలు కాదుకదా, వడ్డీ చెల్లించడానిక్కూడా ఆయనను ముప్పతిప్పలు పెట్టేవారు. ఆ కారణం వల్ల కామయ్య బాకీవసూళ్ళకు కొందరు పొగరుబోతుల సాయం కోరవలసి వచ్చేది. అందుగ్గాను కొంత ధనం ఖర్చు చేయక తప్పేదికాదు.

కామయ్య, వీరదాసును గురించి విని వున్నాడు. ఒక రోజున ఆయన పనిగట్టుకుని దేవరపల్లి వెళ్ళి, వీరదాసును కలుసుకుని, ఆ మాటా యీ మాటా మాట్లాడి చివరకు, ''మీరు, మీ బాకీదార్లనుంచి బాకీ ఎలా వసూలు చేస్తారు ?'' అని అడిగాడు.

అందుకు వీరదాసు, ''నేను వసూలు చెయ్యడం అన్న ప్రసక్తేలేదు. బాకీదార్లు వాళ్ళంతట వాళ్ళే వచ్చి, బాకీ చెల్లు వేస్తారు,'' అన్నాడు.

''కొంతమంది మొండివాళ్ళుంటారు గదా! వాళ్ళ నుంచి ఎలా వసూలు చేస్తారు ?'' అన్నాడు కామయ్య.

దాసరి వెంకటరమణ



''ఎంతటి మొండివాళ్ళ నుంచయినా సరే, నేను వసూలు చేయగలను,'' అన్నాడు వీరదాసు.

కామయ్య వెంటనే, ''అయితే, నేను మీ దగ్గిర రెండువందల రూపాయిలు అప్పు తీసుకుంటాను. ఆ మొత్తాన్ని ఆరునెలల లోపల వసూలు చేయండి. వెయ్యి రూపాయిలు పందెం!'' అన్నాడు.

ఆ మాటలకు వీరదాసు చిన్నగా నవ్వి, ''మిమ్మల్ని గురించి విన్నాను. అయినా, నా కొక నియమం వున్నది. మా గ్రామం కానివాళ్ళకు అప్పు యిచ్చేటప్పుడు, వాళ్ళ నుంచి ఏదైనా వస్తువు తాకట్టు తీసుకుంటాను,'' అన్నాడు.

''అలాగే చెయ్యండి. కాని, ఒక షరతు. మీ బాకీ వసూలు చేసుకున్న తక్షణం, నా తాకట్టు వస్తువు, నాకిచ్చేయాలి,'' అంటూ కామయ్య తన చేతి కున్న బంగారు కంకణాన్ని వీరదాసు కిచ్చి, ''ఆరు నెలల లోపల, నా నుంచి బాకీ వసూలుచేయాలి. అంతేగాని, ఆ బాకీ కింద, నా తాకట్టు వస్తువును అమ్మి జమ వేసుకో కూడదు. ఇందుకు ఇష్టమే గదా?'' అన్నాడు.

వీరదాసు ఒప్పుకుని, కామయ్యకు రెండువందల రూపాయిలు యిచ్చాడు.

అది మొదలు కామయ్య, వీరదాసు బాకీ ఎలా వసూలు చేస్తాడో అని ఆలోచిస్తూ, తగుజాగ్రత్తలో ఉండసాగాడు.

ఆరునెలలు గడిచినై. వీరదాసు, కామయ్యకు బాకీ విషయమై కబురు పెట్టనేలేదు. కామయ్య తాను పందెం గెలిచినట్టే సంతోషపడుతూ, వీరదాసును చూడబోయాడు.

వీరదాసు, కామయ్యను, ''పందెం డబ్బు తెచ్చారా?'' అని అడిగాడు.

కామయ్య ఆశ్చర్యపోయి, ''నేను పందెం డబ్బు తేవడం ఏమిటి? మీరు నా నుంచి బాకీ డబ్బు వసూలు చేయలేదు గదా. పందెం నేనే గెలిచాను!'' అన్నాడు.



వీరదాసు నవ్వి, "మీ బాకీ వసూలు కాకపోవడం ఏమిటి? ఆ మొత్తం ఏనాడో వసూలు చేశాను," అన్నాడు.

"ఆ మాట అబద్ధం! మీరు వసూలు చేశామనేదానికి రుజువేమిటి? పందెం డబ్బు ఎగవేసేందుకు మీరు అబద్ధం ఆడుతున్నారు," అన్నాడు కామయ్య.

"నాకు అబద్ధం ఆడవలసిన అవసరం లేదు," అని వీరదాసు, ఒక నౌకరును కేక వేసి పిలిచి, కామయ్యను చూపిస్తూ, "ఈయనగార్ని నువ్వెరుగుదువా?" అని ప్రశ్నించాడు.

ఆ నౌకర్ను చూస్తూనే కామయ్యకు విషయమంతా అర్థమైంది. జరిగిందేమంటే—

నాలుగు నెలలక్రితం ఒకనాటి రాత్రి విపరీతంగా వర్షం కురుస్తున్నది. కామయ్య అప్పుడే భోజనం ముగించి వరండాలోకి వచ్చాడు. ఆ సమయంలో ఒక వ్యక్తి వర్షంలో తడుస్తూ, ఆయన దగ్గిరకు వచ్చి, "బాబూ, తమరే రక్షించాలి! నా భార్య చావుబతుకుల మధ్య వున్నది. వెంటనే పట్నం తీసుకుపోయి వైద్యం చేయించాలి. ఒక రెండువందల రూపాయిలు అప్పు యివ్వండి," అని అడిగాడు.

కామయ్య వాడికేసి విసుగుపడుతూ చూసి, "ఇది మహబావుంది! నువ్వెవరో, ఏ ఊరివాడివో తెలియదు. అప్పు ఎలా యిచ్చేది? ఏదైనా తాకట్టు వస్తువు తీసుకురా," అన్నాడు.

"తెచ్చాను, బాబూ!" అంటూ ఆ వచ్చినవాడు దుస్తుల్లో నుంచి ఒక బంగారు గాజు బయటికి తీసి, "ఇది, నా భార్యది! దీన్ని తాకట్టుగా వుంచుకుని, త్వరగా డబ్బు యిప్పించండి," అన్నాడు.

బంగారు గాజును చూడగానే కామయ్య కళ్ళు మిలమిల మెరిసినై. ఆయన అప్పటికప్పుడే పత్రం రాసి, వచ్చినవాడితో వేలిముద్ర వేయించి, బంగారు గాజు తీసుకుని రెండువందల రూపాయిలు యిచ్చాడు.



ఈ విధంగా వీరదాసు, కామయ్య నుంచి బాకీ వసూలు చేశాడు!

కామయ్య తీవ్రస్వరంతో, ''మీరు చేసింది పచ్చిమోసం. అనుకున్న షరతు ప్రకారం, నేనిచ్చిన తాకట్టు వస్తువు, బాకీ వసూలు చేసేముందు నాకివ్వవలసి వుంది.'' అన్నాడు.

''ఇందులో మోసం ఏమీ లేదు. ఆ రాత్రి నా నౌకరు మీకిచ్చిన బంగారు గాజు మీదే. ఎటొచ్చీ అది మీరు నా దగ్గిర వుంచిన బంగారు కంకణం కరిగించి చేయించినది. కావాలంటే తూకం సరి చూసుకోండి. పోతే, నాకు మీరు వడ్డీ చెల్లించనవసరం లేదు. ఆ డబ్బుతో గాజును కరిగించి కంకణం చేయించుకోండి.'' అన్నాడు వీరదాసు.

పందెం డబ్బు వెయ్యి రూపాయిలు వీరదాసుకు యివ్వాలంటే, కామయ్యకు మనసొప్పలేదు. ఆయన కొంచెంసేపు ఆలోచించి, ''నేను మీకు వెయ్యి రూపాయిలు యివ్వను. ఎలా వసూలు చేస్తారో చెయ్యండి!'' అన్నాడు మొండిగా.

వీరదాసు పెద్దగా నవ్వి, ''మీరిలా పేచీ పెట్టే అవకాశం వున్నదని ముందే ఊహించాను. షుమారు రెండు వేల విలువచేసే మీ కంకణం, నా దగ్గిరే వున్నది. మీకు, నా నౌకరు యిచ్చిన గాజు పూర్తి బంగారపుదికాదు. రాగిగాజు మీద కొంచెం మందంగా బంగారురేకు తొడిగినది. నాకు రావలసిన పందెం డబ్బు వెయ్యి రూపాయిలూ, నా నౌకరు యిచ్చిన నకిలీ బంగారు గాజూ యిచ్చి, మీ కంకణం పట్టుకుపొండి!'' అని నౌకరుచేత కంకణంతెప్పించి కామయ్యకు చూపాడు.

కామయ్య దిగాలుపడిపోయి కంకణం తీసుకుని, వెయ్యి రూపాయిలూ, గాజూ వీరదాసుకు యిచ్చి వెళ్ళబోతూండగా ఆయన కొక ఆలోచన వచ్చింది.

''మీరు నాకు అప్పు యిచ్చేముందు యిచ్చిన మాట ప్రకారం—ఆ డబ్బు వసూలు చేసేముందు, నా తాకట్టు వస్తువు

యిచ్చేస్తానన్నారు. అవునా ? కాని. మీరు నాకు నకిలీగాజు యిచ్చి మాట తప్పారు.'' అన్నాడు కామయ్య.

''ఇందులో నేను మాట తప్పిందేమీ లేదు.'' అంటూ వీరదాసు చిరునవ్వు నవ్వి, ''కామయ్యగారూ, మీరు మంచి తెలివిమంతులని, నాకు తెలుసు. అటు వంటి మీనుంచి, మీ పందెపు డబ్బూ, నా బాకీ—రెండూ వసూలు చేయాలంటే, మిమ్మల్ని కాస్త తికమక పెట్టవలసి వుంటుందని గ్రహించాను. మీకు నా నౌకరుచేత పంపించింది నకిలీ గాజు కాదు; అచ్చమైన బంగారపుది. అంతే కాక, మీరు నా దగ్గిర వుంచిన కంకణంతో సరితూగగలది. అంటే, రూపం మారినా, నా బాకీ వసూలు చేసేముందు, అన్న మాట ప్రకారం, మీ వస్తువు మీకిచ్చానన్న మాట ! ఒప్పుకుంటారా?'' అని అడిగాడు.

''ఇంత వివరంగా చెప్పాక కూడా, మీరు మాట తప్పారనేంత బుద్ధిహీనుణ్ణి కాను. కాని, వడ్డీలకిచ్చిన డబ్బు వసూలు చేసే పద్ధతుల గురించి, మీవద్ద చాలా నేర్చుకోవలసి వుంది.'' అన్నాడు కామయ్య అక్కణ్ణించి బయలుదేరుతూ.

వీరదాసు, కామయ్యను ఆగమని, ''మనం అప్పుగా యిచ్చిన డబ్బు, బాకీ దారులనుంచి వసూలు చేసుకోవడానికి పద్ధతులూ, పథకాలూ అంటూ ఏమీ లేవు. అవసరపడి అప్పుకోసం వచ్చినవాడి నుంచి, వీలైనంత పెద్ద వడ్డీ రాబట్టాలని మనం దురాశకు పోయినప్పుడే చిక్కులు ప్రారంభమవుతవి. మనం న్యాయమైన వడ్డీకి అప్పు యిచ్చినప్పుడు, తీసుకున్న వాడి మనసులో మనపట్ల కృతజ్ఞతా భావం కలుగుతుంది. ఆ కారణం వల్ల, మనకు బాకీ చెల్లువేయడంలో, ఎలాంటి యిబ్బందులూ కలిగించడు.'' అన్నాడు.

''వీరదాసుగారూ, ఇదంతా మీరు అనుభవపూర్వకంగా తెలుసుకున్నదేగదా. నేనూ, యిక నుంచి మీ మార్గాన్నే అనుసరించదలిచాను,'' అంటూ కామయ్య వెళ్ళిపోయాడు.



# అహంకారి

ఒక వృద్ధరాజు, కొన్ని టీకాతాత్పర్య గ్రంథాల సాయంతో భగవద్గీతను చదివి, దాన్ని పద్య రూపంగా రాశాడు. పని ముగియగానే, ఆయనకు తనంత గొప్ప కవి లేడన్న అహంకారం కలిగింది. రాజ్యంలో కెల్లా గొప్ప కవీ, పండితుడైన విష్ణుశర్మకు ఆయన కబురు చేస్తూ—తనతో సరితూగగల కవిని తన వద్దకు పంపవలసిందిగా ఆదేశించాడు.

విష్ణుశర్మ ఒక యువకుణ్ణి రాజు వద్దకు పంపాడు. రాజు అతడితో, "నువ్వేదో పిల్లకవివై వుంటావు. భగవద్గీత నావంటివాడికే అర్థం కాక, టీకాతాత్పర్యాలు చదవవలసి వచ్చింది. పద్య రూపంలో వున్న, నా కవిత్వం, నీకేం అర్థమవుతుంది! వెళ్ళి, నీ గురువునే పంపు," అన్నాడు విసుగుపడుతూ.

కొద్ది రోజుల తర్వాత విష్ణుశర్మ స్వయంగా వచ్చాడు. రాజు ఆయనతో యువకుణ్ణి గురించి చెప్పాడు. అప్పుడు విష్ణుశర్మ, "మహారాజా, మీరు భగవద్గీతను అర్థం చేసుకోవడానికి చదివిన టీకాతాత్పర్య గ్రంథాలు, నేనిచ్చినవేగదా! అవి రాసింది, ఆ యువకుడే!" అన్నాడు.

రాజుకు అది విని మతిపోయినట్టయింది. ఆయన విష్ణుశర్మను, "మరి, ఆ సంగతి ఆ యువకుడు, నాకు చెప్పలేదేం? అతనంత గొప్ప కవా?" అని అడిగాడు.

అందుకు విష్ణుశర్మ, "నిజమైన కవీ, పండితుడూ తనను గురించి గొప్పగా చెప్పుకోడు, మహారాజా!" అన్నాడు.

ఆ జవాబుతో వృద్ధరాజుకు అహంకారం వదిలిపోయింది.

—ఎం. డి. సౌజన్య



# వింత జలచరాలు

సముద్ర గర్భంలోని ప్రవాళశిలలు రకరకాల చేపలకు నివాసస్థానంగా ఉంటున్నాయి. ఈ పగడాల శిలలను అంటిపెట్టుకుని చిత్ర విచిత్రమైన విషప్రాణులెన్నో జీవిస్తున్నాయి అటువంటి జలచరాలలో ముఖ్యమైనది సీఅనిమోనీ. సీఅనిమోనీ (గాలిపువ్వు) అనే జలచరం చూడడానికి అచ్చగా రంగు రంగుల పువ్వులా ఉంటుంది. అయితే ఇది చేపలకూ, ఇతర జలచరాలు కొన్నింటికీ అత్యంత ప్రమాద కారిగా ఉంటున్నది. అనిమోనీ తలనుంచి పూరేకుల్లా కదలాడేవి—పూరేకులు కావు. అవి విషపూరిత మైన ఆ జంతువు పెద్ద మీసాలు! చిన్న చేపగానీ, మరేదైనా జలచరం గానీ, ఆ మీసం రంగును చూసి ఆకర్షింపబడి, దానిని సమీపించినట్టయితే, అది తాకిన మరుక్షణమే ప్రాణాలు కోల్పోతుంది. అలా చచ్చిపోయిన జంతువును, అనిమోనీ హాయిగా మింగేస్తుంది. దీని మీసంకొన సూదిలాగా ఉంటుంది. అయితే, ఇది స్రవించే విషం, దాని ప్రభావాన్ని కొన్ని రకాల ప్రాణుల మీదే చూపగలుగుతుంది గాని, సమీపించిన ప్రాణులన్నిటి మీదా చూపదు.

పగడాల రాళ్ళకు అంటిపెట్టుకుని ఉండే ఈ అనిమోనీలు మామూలుగా 20 సెం. మీ. కన్నా ఎక్కువ పొడవు ఉండవు. అయితే, ఆస్ట్రేలియాజాతి అనిమోనీ మాత్రం ఒక మీటరు పొడవు కలిగి ఉన్నది. ఈ ప్రాణి ఒక్కొక్కటీ పగడాల శిలలకు దాదాపు ముప్ఫై సంవత్సరాలు అంటి పెట్టుకుని ఉంటాయి. ప్రయోగశాలలలో కొన్ని ఎనభైయేళ్ళవరకూ ప్రాణాలతో ఉన్నాయి. కొందరు జంతు శాస్త్రజ్ఞులు, వీటిలో కొన్ని రకాల ప్రాణులు 300 సంవత్సరాలవరకూ, జీవించి ఉంటాయని విశ్వసిస్తున్నారు. ఆ లెక్క ప్రకారం ప్రస్తుతం ప్రపంచంలో ఎక్కువ కాలం జీవించే జలచరం ఇదే అవుతుంది!

వీటి సంతానాభివృద్ధి రెండు మూడు విధాలుగా కొనసాగుతున్నది. కొన్ని జంతువులు గుడ్లు పెట్టడం ద్వారా సంతానాభివృద్ధికి దోహదం చేస్తే, మరి కొన్ని ఒక ప్రాణి నుంచి మరొక ప్రాణిగా విడిపోయి, కొత్తగా పుట్టుకొస్తాయి.



జలాంతర్గత ప్రవాళశిలల మధ్య పెద్ద పెద్ద రొయ్యలు, యంత్రకాయలూ, నత్తలూ మొదలైన శరీరం మీద గుల్లగల రకరకాల జంతువులు నివసిస్తున్నాయి. హర్మిట్‌క్రాబ్స్ అనే ఒక రకం పీతలు, నత్త వదిలివేసిన గుల్లలో నివాసం ఏర్పరచుకుని, శత్రువుల బారి నుంచి తమను కాపాడుకుంటాయి.

ఇక్కడ కనిపించే మరొక ప్రధానమైన జలచరం నక్షత్రాకారంలో ఉండే స్టార్‌ఫిష్. వీటిలో అనేక రకాలున్నాయి. ఇవి గుల్ల చేపలను పట్టి, ఎంతో పట్టుదలతో, పై గుల్లను ఒలిచేసి, తింటాయి.



మీకు అందిస్తున్నాం!

# క్లియరసిల్ మెరుపు

## కొత్త క్లియరసిల్ సబ్బు
## ఎక్కువగా చేరిన నూనెల్ని తీసేసి, మీకిస్తుంది
## తేటైన, మెరుపుగల ముఖ వర్చస్సు




కొత్త క్లియరసిల్ సబ్బు. మీరు ఇప్పటిదాకా ఇటువంటి దానితో స్నానం చెయ్యలేదు మరి. ఎందుకంటారా ఇది మిగతా వాటిలాగ కాదు— ఈ కొత్త క్లియరసిల్ సబ్బులో గల హాయినిచ్చే పుష్కలమైన నురగ, తీరైన సుగంధం, వింతైన దీని అనుభవం ఎలాగూ బాగుంటుంది— అంతేకాకుండా ఇది మీ చర్మానికి వన్నెకాంతలకి ఎంతో మేలు చేస్తుంది.

అదెందుకంటే, దీన్లోగల ప్రత్యేకమైన పదార్థాలూ, పుష్కలమై, సమృద్ధి అయిన నురగ, మీ చర్మంలోని సూక్ష్మ రంధ్రాలను పూడ్చివెయ్యగల ఆ ఎక్కువగా చేరిన నూనెని సున్నితమైన తీరులో కడిగిపారేస్తుంది గనక. దాంతో ఇక మీ చర్మం మరింత శుభ్రంగా, మరింత తేటగా, అది కూడా మునుపెన్నడూ లేనంతగా రూపొందుతుంది. అదే మరి క్లియరసిల్ మెరుపు అంటే!

**కొత్త క్లియరసిల్ సబ్బు—చర్మంలోని జిడ్డు పోగొట్టేందుకు**

OBM/5428/TEL

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1986 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



Pranlal K. Patel



A. L. Syed

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఏప్రిల్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఆటకు సంది　　　　రెండవ ఫోటో: ఆరాధనకు నాంది

పంపినవారు: మద్దాల వెంకటసుబ్రహ్మణ్యం, దేవరాపల్లి–531 030

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. మాస్కోలో 2. పిరమిడ్స్ 3. లియొనార్డో డా విన్సీ చిత్రించిన 'మోనాలిసా' చిత్ర పటం 4. జపాన్ 5. అమెరికా.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.



# మిఠాయిల మహారాజు కొబ్బరితో గొప్పగా కొత్త రకం విందు ఇవ్వాలనుకుంటున్నాడు!









# కోకోనట్ క్రీమ్




నోరూరించే కోకోనట్ క్రీమ్. కొబ్బరితో ఎంతో అద్భుతమైన సరికొత్త మెత్తని మిఠాయి — ఆ రుచికి మరి మీరు తప్పక లొంగిపోతారు.

<u>నోరూరించే రకరకాల ప్యారీస్ మిఠాయిలు:</u>

కారమిల్క్ • ట్రై-మా
చాకొలెట్ ఎక్లెయిర్స్
కోకోనట్ పంచ్
చాక్లెయిర్స్ • కోకోనట్ క్రీమ్
లాలీపాప్స్ • గోల్డెన్ బాన్ బాన్




**70 సంవత్సరాలకుపైగా మిఠాయిలలో మొట్టమొదటి పేరు**

"ముఖంపై మొట్టమొదటి మొటిమ వచ్చిందని కనుక్కున్న రోజు.
అదే నేను క్లియరసిల్‌ని కనుక్కున్న రోజు"



నాకింకా బాగా గుర్తుంది ఆ రోజు. నేను ఉత్సాహంతో గంతులువేస్తున్న రోజు....అక్కయ్య పెళ్ళి యింకా సరిగ్గా వారం రోజులుండేమో. కొత్త బట్టలు ముచ్చటగా వేసుకుంటూ అద్దం ముందు నిలబడ్డా— చటుక్కున గాబరాపడ్డా....నా బుగ్గ మీద ఏదో వచ్చిందని చూసుకుని....మొటిమ. నా ముఖంపై వచ్చిన మొట్టమొదటి మొటిమ. నేననుకున్నా చటుక్కున....నా కేమిటి, యిదేమిటి. యిప్పుడే రావాలేమిటి అని!

అప్పుడే కన్పించింది అక్కయ్య అక్కడికి, చూసింది నా వాలకం—"పిచ్చి పిల్లా, యీ మాత్రం తెలియదా. యీ వయసులో అందరికీ వస్తాయి గదా మొటిమలు. నాకూ వచ్చాయి. వాడేను నేనప్పుడు క్లియరసిల్. వాడాలి నువ్వూ మరి. ఏం?" వాడేను నేనూ మరందుకే. ఏమైందో తెలుసా? పనిచేసిందది!....ఇక ఆ ఉషారులో పెళ్ళి పందిట్లో ఎంత చలాకీగా తిరిగానో ఏం చెప్పమంటారు.

**క్లియరసిల్, మొటిమల్ని పోగొడుతుంది, దాంతో బాటే వాటిని పాకకుండా చేస్తుంది.**






# క్లియరసిల్

మొటిమల్ని పోగొట్టేందుకు ప్రత్యేకమైన చికిత్స-ఎక్కువ ప్రభావంతో పని చేసేది.

పాపా జీ?

పార్లే-G!




## 'పార్లే-G' ఎందుకని?

మీకు అత్యంత ప్రియమైన బిస్కట్లకు
చక్కటి తియ్యటి చిట్టిపేరు ఉండవద్దూ !
అందుకే 'పార్లే-G' అన్న పేరు. అవును కదా మరి.
'పార్లే-G' అని పిలవడంలో మరెంతో సాన్నిహిత్యం
వ్యక్తమవుతుంది. ఈ బిస్కట్లలో జీవనదిలా ఆ పాలు,
గోధుమలు, చక్కెర, జీవనదిలా ఆ శక్తినిచ్చే గ్లూకోజ్,
జీవనదిలా ఆ గొప్పరుచి పొంగి పొర్లుతుంటే
'పార్లే-G' అన్న పేరు వీటికి చక్కగా నప్పుతుంది కదూ!

PARLE

Gluco

## ప్రేమతో నిండిన పేరు 'పార్లే-G'

మరింత రుచిగల శక్తిదాయక ఆహారం.

భారతదేశంలో అత్యధికంగా అమ్ముడవుతున్న బిస్కట్.

everest/85/PP/556-tl